Sunday, Piano, Nursery Rhymes
It's Morton for me all the time



MORTON
SWEETS

I Love my Sundays ..... Nursery Rhymes and my Mummy close to me and Mortons
all the time. It has been our Family's favourite for years and years.
Delicious and yummy in so many flavours. All with the goodness of
Creamy Milk, Glucose and Sugar.
Chocolate and Coconut Cookies, Rose Eclairs, Supreme
Chocolate and Coconut Toffees, Lacto Bonbons Mango King
and so many other delicious treats.
Um m m m m Every bite a yummy delight.

A lifetime of real goodness

**MORTON CONFECTIONERY & MILK PRODUCTS FACTORY**
P.O. : Marhowrah 841 418 Dist. : Saran, Bihar

CC/M-1/93

**Caution Notice :**

ఆడుకుందాం... రా!

గ్రేట్ ఇండియా
ఎంటర్‌టైన్‌మెంట్స్








నాగార్జున అక్కినేని
శివనాగేశ్వరరావు





PRIME
LEADER
PIDILITE
PRIME
GENIUS
MATHEMATICAL DRAWING INSTRUMENTS
PRIME
RANK
PIDILITE
PRIME
MERIT
PIDILITE
WINNER






# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి




## సహనం - సమభావం

ప్రపంచ దేశాల దృష్టిని ఒక నిర్దిష్టమైన సమస్య మీదికి మళ్ళించడానికి, ఐక్యరాజ్య సమితి ఒక్కొక్క సంవత్సరాన్ని ఒక్కొక్క పేరుతో ప్రకటిస్తున్నది. ఆవిధంగా గత సంవత్సరాన్ని కుటుంబ సంవత్సరంగానూ, ఈ సంవత్సరాన్ని సహన సంవత్సరంగానూ ప్రకటించింది.

1979వ సంవత్సరాన్ని అంతర్జాతీయ బాలల సంవత్సరంగా ప్రకటించి, బాలల అభివృద్ధికి దోహదం చేసే అనేక పథకాలను రూపొందించింది. బాలల హక్కుల సంరక్షణకు వివిధ సదస్సులూ, సమావేశాలూ ఏర్పాటు చేసింది. 1994వ సంవత్సరాన్ని కుటుంబ సంవత్సరంగా ప్రకటించి, కుటుంబ సభ్యుల మధ్య ఉండవలసిన పరస్పర అవగాహన, అనురాగం మొదలైన వాటి ప్రాముఖ్యతను చాటింది. ప్రజల మధ్య ఉండవలసిన సహనం, ఓర్పు మొదలైన ఉన్నత గుణాల ఆవశ్యకతను తెలియజెప్పడానికి 1995వ సంవత్సరాన్ని సహన సంవత్సరంగా ప్రకటించింది.

వివిధ సంస్కృతులకు, సంప్రదాయాలకు, భాషలకు, అవసరాలకు నిలయమైన మానవ సమాజంలో భిన్న అభిప్రాయాలూ, పరస్పర విరుద్ధ భావాలూ నెలకొనడంతో ఆశ్చర్యం లేదు. అయితే, వాటి పట్ల సహన భావంతో మసలుకోవడంలోనే మనిషి ఔన్నత్యం ఉన్నది. ఒక విషయాన్ని గాని, సమస్యను గాని భిన్న కోణాల నుంచి పరిశీలించినట్టయితే ఈ నిజం విశదమవుతుంది. సహనం మానవత్వానికి గీటురాయి!

సహనం, సమభావం అన్నవి మత సంబంధమైన విషయంలో మరీ ముఖ్యం. మతాన్ని ఆత్మ జ్ఞాన సాధనంగా భావించిన మహాత్మా గాంధీ, "అన్ని మతాలనూ నేను సమభావంతో చూస్తాను. ఎందుకంటే అవన్నీ చాటేవి ఒక సత్యాన్నే!" అన్నాడు. ప్రపంచానికి సర్వమత సామరస్యాన్ని, సహనాన్ని, సమభావాన్ని ప్రబోధించిన మహాత్మాగాంధీ 125వ జన్మదిన వేడుకలను ఈ సంవత్సరం జరుపుకుంటున్నాము. యాదృచ్ఛికంగా ఈ సంవత్సరాన్నే - ఐక్యరాజ్య సమితి సహన సంవత్సరంగా ప్రకటించడం సంతోషించతగిన విషయం.


సంపుటి : 97    అక్టోబర్ '95    సంచిక : 4

విడిప్రతి : 5.00    సంవత్సర చందా : 60.00




వార్తలు - విశేషాలు:

# థాయ్‌లాండ్‌లో ఏడు పార్టీల పాలన!

థాయ్‌లాండ్‌లో జూలై 2వ తేదీ జరిగిన పార్లమెంటు ఎన్నికలలో ఛార్ట్‌థాయ్ పార్టీ ఎక్కువ స్థానాలు గెలుచుకున్నది. ఆ పార్టీ నాయకుడు బాన్ హర్న్ శిల్పా-అర్చా థాయ్‌లాండ్ 21వ ప్రధానమంత్రి అయ్యాడు. అంతకు పూర్వం పాలక పక్షమైన డెమొక్రటిక్ పార్టీ నాయకుడు చువాన్ లీక్‌పాయ్, 33 నెలల పాటు ప్రధానమంత్రి పదవిలో కొనసాగాడు.

పూర్వం సయామ్ అని పిలువబడిన థాయ్‌లాండ్‌లో సంపూర్ణ రాచరిక వ్యవస్థ అమలులో ఉండేది. 1932వ సం॥లో జరిగిన తిరుగుబాటు ద్వారా ప్రజాస్వామిక రాజ్యాంగ వ్యవస్థ అమలులోకి వచ్చింది. దాని ప్రకారం రాజు రాజ్యాధినేతగానూ, ప్రధానమంత్రి ప్రభుత్వనేతగానూ ఉంటారు. ఆగ్నేయాసియాలో పరాయి పాలనకు లోనుగాని, అంటే మరే దేశానికి కాలనీగా మారని ఒకే ఒక దేశం సయామ్ అన్నది ఇక్కడ చెప్పుకోతగిన విశేషం!

1939వ సం॥లో సయామ్ అనే పేరును థాయ్‌లాండ్‌గా మార్చారు. 1946వ సం॥లో భూమి బోల్ ఆదుల్యదేజ్ సింహాసనాన్ని అధిష్ఠించి గత యాభై యేళ్ళుగా పరిపాలిస్తున్నాడు. ఆయన బాన్ హర్న్ శిల్పా అర్చాను 21వ ప్రధానమంత్రిగా ప్రకటించాడు.

థాయ్‌లాండ్ పార్లమెంటులో మొత్తం 391 స్థానాలు ఉన్నాయి. ఈ ఎన్నికలలో ఛార్ట్‌థాయ్ పార్టీ అధిక స్థానాలను అంటే, 92 స్థానాలను గెలుచుకున్నది. అప్పటి పాలకపక్షమైన డెమొక్రటిక్ పార్టీ 82 స్థానాలను సాధించింది. అందువల్ల ఏ పార్టీకిగాని ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి కావలసిన పూర్తి మెజారిటీ రాకపోవడంతో – న్యూయాస్పిరేషన్ పార్టీ (57), పలాంగ్ ధర్మా (23) సోషల్ యాక్షన్ పార్టీ (22) థాయ్ సిటిజెన్స్ పార్టీ (18) మాస్ పార్టీ (3) అనే ఐదు ప్రతిపక్షాలు తమ మద్దతును ఛార్ట్ థాయ్ పార్టీకి తెలియజేశాయి. బాన్ హర్న్ శిల్పా - అర్చా ప్రధాని కావడానికి కావలసిన మెజారిటీ లభించిందని రూఢి అయిన తరవాత 18 స్థానాలు గెలుచుకున్న నామ్‌థాయ్ పార్టీ కూడా ఆయన ప్రభుత్వంలో పాలు పంచుకోవడానికి ముందుకు వచ్చింది. ఆ విధంగా ఏడు పార్టీల పాలకపక్షానికి మొత్తంమీద 233 స్థానాలు లభించాయి.

మొదటి ఐదు పార్టీలకు ఐదు ఉపప్రధాని పదవులూ, నామ్‌థాయ్ పార్టీకి రక్షణ, రవాణా, వ్యవసాయం, విదేశ వ్యవహారాలు మొదలైన కీలక శాఖల మంత్రిత్వ పదవులూ ఇవ్వాలని ఒక ఒప్పందానికి వచ్చారు.

భూసంస్కరణలు అమలు చేయడంతో పాటు పేదరికాన్ని నిర్మూలించగలమని నాయకులు ఎన్నికల సమయంలో వాగ్దానం చేశారు.





# వజ్రసేనుడి నిర్ణయం

పూర్వం వజ్రగిరిఅనే చిన్నపట్టణంలో, వజ్రసేనుడనే వ్యాపారి వుండేవాడు.అతడు వ్యాపారంలో కోట్లు గడించినా, చాలాకాలంపాటు సంతానం లేక బాధపడ్డాడు. చివరకు అతడికి వినయపాలుడు, విజయపాలుడు అనే ఇద్దరు కొడుకులు కలిగారు. లేక లేక కలిగిన ఆ పిల్లలను వజ్రసేనుడు, అతడి భార్య రూపమతి ఎంతో గారాబంగా పెంచసాగారు.

బాల్యం నుంచీ విజయపాలుడు, అన్నం తినడం దగ్గర నుంచీ ప్రతిదీ తనే స్వయంగా చేయాలనే పట్టుదల చూపేవాడు. ఇందుకు భిన్నంగా వినయపాలుడు, ప్రతి చిన్నపనికీ తల్లిమీదా, దాసదాసీలమీదా ఆధారపడుతూండేవాడు.

ఈ తేడా గమనించిన రూపమతి, తన చిన్నకొడుకు విజయపాలుడు తనకు దూరమైపోతున్నట్టే బాధపడేది. కాని భార్య ద్వారా సంగతి తెలుసుకున్న వజ్రసేనుడు, "పిల్లవాడికి అటువంటి స్వతంత్రపు నడవడిక మంచిదే! వాడి ఇష్టప్రకారమే జరగనీ," అనే వాడు.

ఆవిధంగా భిన్న స్వభావాలుకల ఆ అన్నదమ్ములిద్దరూ, క్రమంగా యుక్తవయస్కులై, విద్యాభ్యాసం పూర్తి చేశారు.

ఆ క్షణం కోసమే ఎదురుచూస్తున్న వజ్రసేనుడు, కొడుకు లిద్దరికీ వ్యాపారంలో స్వయంగా శిక్షణ ఇవ్వడం ప్రారంభించాడు. ఈ కారణం వల్ల, కొద్దిరోజుల్లోనే, ఇద్దరిలోకీ విజయపాలుడే చురుకైన వాడన్న సంగతి, వజ్రసేనుడికి గ్రాహ్యంకాసాగింది. వజ్రసేనుడి వ్యాపార భాగస్వాములు, అతడి పరిజనులు అందరూ విజయపాలుడి చురుకుదనాన్నే మెచ్చుకునేవారు. అయితే, అదేసమయంలో, "వినయపాలుడి వంటి గుణనిధీ, పితృవాక్య పాలకుడూ మరొకరు వుండరు!" అనేవారు.

ఇలా కొన్నాళ్ళు గడిచాక ఒకనాడు, వజ్రసేనుడు, విజయపాలుణ్ణి పిలిచి, "నువ్విక

లక్ష్మీగాయత్రి

స్వయంగా వ్యాపార బాధ్యతలు నిర్వహించ వచ్చు. అయితే నాకొక ఆలోచన వున్నది. నేను వ్యాపారం ప్రారంభించినప్పుడు, పెట్టుబడి ఎక్కువపెట్టలేక భాగస్వాములను కలుపుకోవలసి వచ్చింది. అందుచేత లాభాలు రావడానికి, నా తెలివితేటలే ముఖ్య కారణమైనప్పటికీ, వచ్చిన దాన్ని పంపకం చెయ్యవలసి వస్తున్నది. నీకీనాడు ఒక సరికొత్త వ్యాపారం ప్రారంభించడానికి కావలసిన మూలధనాన్ని నేను అవలీలగా సమకూర్చగలను. అది తీసుకుని నువ్వు, మనపొరుగునే వున్న విశాలనగరానికివెళ్ళు. అక్కడ కొబ్బరి వ్యాపారానికి మంచిగిరాకీ వున్నది. నీ తెలివితేటలతో అక్కడ కొబ్బరి వ్యాపారం చెయ్యి. ఏమంటావు?" అని అడిగాడు.

విజయపాలుడు సంతోషంగా, "అలాగే, నాన్నా!" అన్నాడు.

ఈ జవాబుకు వజ్రసేనుడు తృప్తిపడి, "అయితే, మరొక ముఖ్యమైన సంగతి. నా భాగస్వామి వరుణదత్తుడు, తన కుమార్తెలు మాళవిక, మృణాళినిలను నీకూ, వినయపాలుడికీ ఇస్తానని కబురు చేశాడు. ఇద్దరూ విద్యారూపగుణవతులే. కాని పోల్చి చూస్తే మాత్రం మాళవిక, మృణాళిని కంటే అన్నింటిలోనూ అధికురాలు. ఆమె పెద్దదిగనక, వినయపాలుడికి వధువుగా నిర్ణయిస్తే బాగుంటుంది. ఇక మృణాళినిని చేసుకోవడం నీకిష్టమేగదా!" అన్నాడు.



విజయపాలుడు ఒక్కక్షణం మౌనంగా వూరుకుని, "మృణాళిని గురించి వినడమే కాదు, నాన్నా! ఒకసారి చూశానుకూడా. నాకిష్టమే," అన్నాడు.

భర్త ద్వారా విషయాలన్నీ తెలుసుకున్న రూపమతి మాత్రం, కొడుకుల వివాహ వార్తలకు ఎంత ఆనందించిందో, విజయపాలుడి నూతన వ్యాపార పథకాలూ, విశాలనగరానికి అతడి ప్రయాణాలూ అంతావిని, చాలా ఖేదపడింది.

వజ్రసేనుడు నిర్ణయించినప్రకారమే కొద్దిరోజుల్లో, వినయపాలుడి వివాహం మాళవికతోనూ, విజయపాలుడి వివాహం మృణాళినితోనూ జరిగిపోయాయి.



వివాహమైన కొద్ది రోజులకే వజ్రసేనుడు, విజయపాల మృణాళిని లిద్దర్నీ వెంటబెట్టుకుని, విశాలనగరానికి వెళ్ళి, అక్కడి ఏర్పాట్లన్నీచేసి, తిరుగు ప్రయాణమయ్యాడు.

బయల్దేరే ముందు అతడు, విజయపాలుడితో, "నాయనా! ఇన్ని సంవత్సరాలుగా వ్యాపారం చేసీ చేసీ నేను చాలా అలిసిపోయాను. సముద్ర తీరప్రాంతాన వున్న ఈ విశాలనగరంలో నివాసం నాకు చాలా హాయిగా వున్నది. మీ అమ్మతోబాటు కొన్నాళ్ళు ఇక్కడే విశ్రాంతి తీసుకుందామని అనుకుంటున్నాను. ఏమంటావు?" అన్నాడు.

తండ్రి మాటలకు విజయపాలుడు చిన్నగా నవ్వి, "నన్ను విశాలనగరంలో వ్యాపారానికి ప్రోత్సహించిన నాడే, ఏదో ఒకనాడు మీరిలా అడగబోతారని ఊహించాను, నాన్నా! ఇది మీ ఇల్లు.. మీఇంట్లో మీరు విశ్రాంతి తీసుకోవడానికి ఒకరి నడగవలసిన పనిలేదు. ఎదుగుతున్న బిడ్డ అన్ని పనులూ స్వతంత్రంగా చేసుకోవడానికి సహకరించడం తల్లిదండ్రులకు ఎంత బాధ్యతో, వయసు మళ్ళిపోతున్న తల్లిదండ్రులకు విశ్రాంతినిచ్చి, వారికి అన్ని పనులూ చేసిపెట్టడం, సేవచెయ్యడం, పిల్లలకు అంతే బాధ్యత," అన్నాడు.

ఈ జవాబుకు వజ్రసేనుడు చాలా ఆనందించి, వజ్రగిరికి తిరిగి వచ్చిన తర్వాత, భార్యకు మాత్రమే జరిగినదంతా చెప్పాడు.

అంతావిన్న రూపమతి అయిష్టంగా తల వూపి, "నిజంగా మీరు అలిసిపోయి విశ్రాంతి తీసుకుందామనుకుంటున్నారా?" అని ప్రశ్నించింది.

వజ్రసేనుడు నవ్వి, "అది అబద్ధమనా నీ అనుమానం?" అని ఎదురు ప్రశ్నించాడు.

దానికి రూపమతి, "అనే అనిపిస్తున్నది. విజయపాలుడికి వ్యాపారంలోగాని ఇతరత్రాగాని, మీ సహాయ సహకారాలు అవసరంలేదు. కాని వినయుడు మాత్రం మీరు లేనిదే ఒక్క నిమిషం వుండలేడు. ఇన్నాళ్ళుగా మీరు లేనందువల్ల, వ్యాపారంలో కొంత నష్టం వచ్చిందని బాధపడుతున్నాడు. తల్లిదండ్రులుగా, బలహీనుడైన వినయుణ్ణి అంటిపెట్టుకుని వుండడమే మనకర్తవ్యం. పైగా మనం వాళ్ళను

విడిచి పెట్టి వెళ్ళడానికి వినయుడూ, కోడలూ కూడా ఎంతమాత్రం ఒప్పుకోరు," అన్నది.

భార్య మాటలువిన్న వజ్రసేనుడు, "పోనీ, ఒక పని చెయ్యి. మనం కొన్నాళ్ళపాటు విజయుడి దగ్గర వుండడానికి వెళ్ళబోతున్నట్టు కోడలికి చెప్పిచూడు. ఆపని వినయుడు లేని సమయంలోనే చెయ్యి సుమా!" అన్నాడు.

రూపమతి ఒక్కక్షణం ఆగి, "సరే, మీ మాట ఎందుకు కాదనాలి? మీరు వినయుణ్ణి వదిలివెళ్ళడానికి కోడలు ఒప్పుకోదు," అన్నది.

మర్నాడు వాడిన మొహంతో తన దగ్గరకు వచ్చిన రూపమతిని చూసి వజ్రసేనుడు, "ఏం, మాళవికకు చెప్పావా?" అని అడిగాడు.

"ఆఁ, చెప్పాను," అని కళ్ళనీళ్ళ పర్యంతమవుతూ, "ఏమంటుంది? అసలు ఆ పిల్లకు మనం ఇక్కడ వుండడం ఇష్టం లేనట్టున్నది. ముందు మాట్లాడలేదు. తర్వాత – మంచిదే అత్తయ్యా! ఈయన ఎలాంటివారో, విజయుడు కూడా అలాంటి కొడుకేగదా! అని తప్పించుకున్నది," అన్నది రూపమతి.

"అయితే, ఇక ప్రయాణానికి నీకేమీ అభ్యంతరం లేనట్టేనా?" అని అడిగాడు వజ్రసేనుడు.

"బాగుంది. వినయుడు ఒప్పుకోవద్దూ?" అన్నది రూపమతి.

"వాణ్ణి ఒప్పిస్తాను. నేటికి పదవ రోజునే మన ప్రయాణం," అన్నాడు వజ్రసేనుడు.

ఆ మర్నాడు వజ్రసేనుడు, వినయుడితో తన ప్రయాణం గురించి చెప్పి, "నేను ఖచ్చితంగా ఇన్నాళ్ళ తర్వాత తిరిగి వస్తానని చెప్ప





లేను. ఇక్కడి వ్యాపారవ్యవహారాలన్నీ పూర్తిగా నీకే అప్పజెబుతున్నాను. అవసరమైతే, మీ మామగారు వరుణదత్తుడి సలహా తీసుకో. ఒక్క విషయం గుర్తుంచుకో! వ్యాపారి అయిన వాడెప్పుడూ సత్వరంగా స్వీయనిర్ణయాలు తీసుకోగలిగివుండాలి. అప్పుడే వ్యాపారంలోనే గాక, జీవితంలో కూడా రాణిస్తాడు," అని, రెండవ కొడుకు విజయుడి దగ్గరకు ప్రయాణమయ్యాడు.

విశాలనగరం చేరిన వజ్రసేనుడికి, వజ్రగిరి వార్తలు ఎప్పటికప్పుడు తెలుస్తూనే వున్నవి. రెండు నెలలు గడిచేసరికి వినయపాలుడు కూడా మంచి వ్యాపారదక్షత సంపాయించాడనీ, అతడి యాజమాన్యంలో, వజ్రసేనుడి హయాంలో కూడా రానన్ని లాభాలు వస్తున్నవనీ వార్తలు రాసాగాయి.

వినయుడిలో వచ్చిన మార్పుకు చాలా సంతోషించిన వజ్రసేనుడు, ఒకనాడు విజయుణ్ణి, "నాయనా! కొన్నాళ్ళ క్రితం, నేను మీ అమ్మతో కలిసి ఇక్కడికి వస్తానన్నప్పుడు, ఆ సంగతి ముందుగానే ఊహించానన్నావు. ఇప్పుడు నీ అన్న మంచి వ్యవహారదక్షుడయ్యాడని తెలుసుకున్నాక, నేను ఏమని అడగబోతున్నానో ఊహించగలవా?" అని ప్రశ్నించాడు.

"ఊహించగలగడమేమిటి, నాన్నా, ఎప్పుడో ఊహించాను! ఇక్కడి వ్యాపారమంతా ఎత్తిగట్టి, తిరిగిమనమంతా మనస్వస్థలం వజ్రగిరి వెళ్ళబోతున్నాం," అన్నాడు విజయపాలుడు.

దాపులవుండి, ఈసంభాషణ విన్న రూపమతి ఎక్కడలేని ఆశ్చర్యంతో భర్తను, "వజ్రగిరికి తిరుగు ప్రయాణంసరే! ఇక్కడి వ్యాపారమంతా ఎత్తిగట్టడమేమిటి? అసలు మీరు వజ్రగిరి వదిలి ఇక్కడికెందుకొచ్చినట్టు? ఇక్కడ కొత్త వ్యాపారం దేనికి ప్రారంభించినట్టు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది.

దానికి వజ్రసేనుడు, "నీ ప్రశ్నలకు జవాబిచ్చే తీరుబాటు, నాకిప్పుడులేదు. మనం వజ్రగిరి చేరాక, కావాలంటే మరికొన్ని ప్రశ్నలు కూడా కలిపి అడుగు, జవాబు చెబుతాను," అన్నాడు.

అందరూ తిరిగి వజ్రగిరికి వచ్చారు. ఆ తర్వాత రూపమతి ఒకనాడు భర్తను, తాను

విశాలనగరంలో అడిగిన ప్రశ్నలే అడిగింది. అప్పుడు వజ్రసేనుడు, ఆమెతో, "నీక్కలిగిన అనుమానాలను దాచకుండా అడగడం మేలే అయింది. లేకపోతే కొడుకుల మధ్య, నేనేదో పక్షపాతం చూపుతున్నానన్న బాధ నీకు మిగిలి పోయేది! వినయపాలుడిలో, వ్యాపార విషయాల గురించి సొంత నిర్ణయాలు చేసే గుణంలోపించింది. ఇతరుల మీద ఆధారపడే ఈ లక్షణాన్ని వాడిలో బాల్యం నుంచీ నేను గమనిస్తూనే వున్నాను. అందుకే, అక్కచెల్లెళ్ళలో తెలివి మంతురాలైన మాళవికను వాడికి భార్యగా చేశాను," అని ఇంకా ఏదో చెప్పబో తూండగా రూపమతి అయిష్టంగా తలాడిం చింది.

ఇది గమనించిన వజ్రసేనుడామెను, "నీకేదో కొత్త అనుమానం కలిగినట్టున్నది! ఏమిటది?" అని అడిగాడు.

"మీరన్నట్టు మాళవిక అంత తెలివిగలదైతే, వినయుడికి తగిన సలహాలిచ్చి సాయపడ వచ్చు గదా? మరి అలా జరగలేదు," అన్నది రూపమతి.

"అందుక్కారణం చెబుతాను విను!" అంటూ వజ్రసేనుడు ఒక్కక్షణం ఆగి, "నేనిక్కడుండగా తన సలహాలు వాడు పాటించడని మాళవిక గ్రహించింది. అందుకే, మనం విశాలనగరం వెళుతున్నామన్నప్పుడు, సరే కాదు అనకుండా ముభావంగా జవాబు చెప్పింది. అయితే, సూక్ష్మగ్రాహి అయిన విజయుడు ముందే నా పథకం అంతా ఊహించగలిగాడు. ఏది ఏమైతేనేం—వినయుడు మనం ఇక్కడ లేని కాలంలో, స్వతంత్రంగా ఆలోచించి వ్యాపార సమస్యలను పరిష్కరించుకోగల దక్షత సంపా యించాడు. నా నిర్ణయం ఫలించింది! ఇది జరిగాక, విజయుడు ఎక్కడో విశాలనగరంలో వుండవలసిన అవసరంలేదు. ఇక్కడే అన్న దమ్ములిద్దరూ ఒకరికి ఒకరుతోడుగా వుంటూ, వ్యాపారాన్ని సమర్థంగా నడపగలరు," అన్నాడు.

ఇది విని రూపమతి ఎక్కడలేని ఆశ్చ ర్యంతో, "మాట మాత్రంగానైనా, నాతో చెప్ప కుండా ఎంత పెద్ద ఆలోచన చేశారండీ!" అంటూ భర్తను మెచ్చుకున్నది.



# నిస్వార్థమైన కోరిక!

దేశాలుపట్టి తిరుగుతున్న వృద్ధుడొకడికి, ఒకకొండ ప్రాంతానఎండలోమెరుస్తూ సీసా ఒకటి కనిపించింది. వృద్ధుడు, ఆ సీసా తీసుకుని మూత తీయగానే, భూతం ఒకటి ఫెళ్ళున బయటికి దూకి, "నాకు బంధ విముక్తి కలిగించావు! నీ కోరిక ఒకటి తీర్చదలిచాను.అది నిస్వార్థమైనదని,నాకు నమ్మకం కలగాలి. దేశానికి రాజు కావాలనో, ఏ రాజకుమారి కావాలనో కోరితే మాత్రం, నేను తీర్చను," అన్నది.

ఆ వృద్ధుడు వెంటనే, "ఏభై ఏళ్ళ క్రితం నాకూ, నా సోదరుడికీ మధ్య కలతలు వచ్చి విడిపోయాం. ఇప్పుడు వాడు నన్ను సోదరభావంతో ఆదరించేలా చెయ్యి," అని కోరాడు.

"ఆహాఁ, ఎంత అపూర్వమైన సోదరప్రేమ!" అంటూ భూతం మాయమై, మళ్ళీ ప్రత్యక్షమై, "నీ కోరిక తీర్చాను. నీ సోదరుడు నిన్ను వెతుక్కుంటూ వస్తాడు," అన్నది.

వృద్ధుడు ఏదో అనుమానం వచ్చినవాడిలా తల గోక్కుంటూ, "ఈ కోరికలో స్వార్థం వున్నదని ఉపసంహరించుకోవు గదా?" అని ప్రశ్నించాడు.

"అలా ఎన్నటికీ చేయను. ఏనాడో విడిపోయిన సోదరుడి సాన్నిహిత్యం కోరుకుంటున్నావు! ముసలితనం మీదపడడంవల్ల, ఏ క్షణంలోనైనా చచ్చిపోతానన్న భయం వల్లనా?" అని అడిగింది భూతం.

ఈసారి వృద్ధుడు పట్టరాని సంతోషంతో పెద్దగా నవ్వి, "అలాంటి భయం నాకేంలేదు. నా సోదరుడు నాకన్న పదేళ్ళు పెద్ద. ఈ దేశానికి రాజైన వాడికి సంతానం లేదు. వాడికి ఏకైక వారసుణ్ణి నేనే!" అన్నాడు.

ఆ జవాబు విని భూతం,"ఔరా!" అంటూ పెద్దగా కేక పెట్టి,కొండలకేసి ఎగిరిపోయింది. —ఆర్. సత్య






# 4

[ఫాలలోచనుడనే రాక్షసుడి బారినుంచి తప్పించుకున్న రూపధరుడూ, అతని అనుచరులూ నౌకాద్వీపాన్ని చేరి, ఆ ద్వీపాన్ని ఏలే చిత్రాశ్వుడి నుంచి గొప్ప సహాయం పొందారు. ఆయన వారికి మారుతాలన్నిటినీ ఒక తిత్తిలో బంధించి ఇచ్చాడు. రూపధరుడి నౌకలు దాదాపు స్వదేశాన్ని చేరాయి. ఆఖరుక్షణంలో రూపధరుడి అనుచరులు తిత్తిని విప్పి మారుతాలను పైకి రానిచ్చారు. వాటి ప్రభావంచేత రూపధరుడి నౌకలు ధృవప్రాంతానికి కొట్టుకుపోయాయి. అక్కడ ఉండే రాక్షసులు రూపధరుడి అనుచరులనూ, నౌకలనూ సర్వనాశనం చేశారు. రూపధరుడున్న నౌకమాత్రమే వారి నుంచి తప్పించుకున్నది. —తరవాత]

రూపధరుడు తన మిగిలిన అనుచరులతో బయలుదేరాడు. మృత్యువువాత పడకుండా తప్పించుకున్నందుకు అతనికి ఆనందంతో పాటు, తన మిగిలిన నౌకలూ, వాటిలో వున్న అనుచరులు చాలామంది నాశనమయినందుకు విచారం కూడా కలిగింది.

కొంతకాలానికి రూపధరుడి నౌక ఒక దీవిని చేరింది. ఈ దీవిపై సుకేశిని అనే ఒక దేవత ఉంటున్నది. ఈమె జుట్టు చాలా అందంగా ఉంటుంది. ఈమె సూర్యుడికీ, వరుణరాజు కుమార్తెకూ పుట్టినది. మనుషుల భాష మాట్లాడుతుంది, కాని ఈమె మనుషులకు మంచిచేసే స్వభావం కలది కాదు.

రూపధరుడి కీమె సంగతులేవీ తెలియవు. అతను తన నౌకను తీరాన, రేవుగా ఉన్న చోట కట్టేయించి రెండు పగళ్లూ, రెండు రాత్రులూ తన అనుచరులతో అక్కడే గడిపాడు. ఈ రెండురోజులపాటు గ్రీకులు నిరు



త్సాహంలో మునిగిపోయి, నిరాశతో కుంగి పోయారు.

మూడోరోజు తూర్పు తెల్లవారే సమయాన రూపధరుడు తన కత్తి, ఈటే తీసుకుని, ఒక ఎత్తయిన మిట్ట ఎక్కి చుట్టూ కలయజూశాడు. అతనికి ఎవరూ కనిపించలేదు గాని, దూరాన చెట్లమధ్య నున్న సుకేశిని ఇంటినుంచి పొగ ఆకాశంలోకి లేస్తూ ఉండటం కనబడింది. మొట్టమొదట రూపధరుడు తానే స్వయంగా వెళ్లి, ఆ చెట్లమధ్య ఉన్న ఇంట్లో ఎవరు నివసిస్తున్నారో కనుక్కుందామనుకున్నాడు. కాని, అంతకంటే తాను తన నౌకవద్దకు తిన్నగా తిరిగి వెళ్లి, అందరూ భోజనం చేసి నాక, తన మనుషులను కొందరిని పంపి ఆరా తెలుసుకోవటం మంచిదని అతనికి తోచింది.

కానిభోజనం చెయ్యటానికి కూడా ఆహారం లేదు. ఈ విషయం ఆలోచిస్తూ రూపధరుడు తన నౌకకేసి పోతూండగా, ఏ దేవుడో పంపి నట్టుగా ఒక దుప్పి అతని దారికి అడ్డంగా వచ్చింది. దాని కొమ్ములు చాలా నిడుపుగా వున్నాయి. ఎండ బాగా కాస్తూండటంవల్ల, సమీపంలో ఉన్న నదిలో దప్పి తీర్చుకోవటానికి అది పోతున్నది.

రూపధరుడు ఆ దుప్పిని సమీపించి తన ఈటెను బలంగా దాని వెన్నులోకి పొడిచాడు. ఆ దెబ్బతో అది కిందపడి,మూలిగి, ప్రాణాలు వదిలింది. రూపధరుడు కొన్ని లతలను పేని తాడులాగా చేసి, ఆ తాడుతో దుప్పి కాళ్లను బంధించి, తాటిని తన మెడకు తగిలించి, దుప్పిని వీపున మోస్తూ, ముందు వంగబడి నడుస్తూ తన నౌక వద్దకు వెళ్లాడు. ఇలా ఎందుకు చేయవలిసి వచ్చిందంటే, భుజాన వేసుకుపోవటానికాదుప్పిచాలాభారీఅయినది.

అతను తాను కొట్టిన దుప్పిని పడవ ముందు పడేసి, తన అనుచరులకు ఉత్సాహం కలిగించే కబుర్లు ప్రారంభించాడు: “మిత్రు లారా, మనం ఇంతలో చచ్చిపోయేవాళ్లం కాము. మనకోసం యమలోకం ఇంకా చాలా కాలంకాచుకుని వుంటుంది. ఆహారం వుండగా మనం తిండి మాననవసరం లేదు. మనం ఆకలికి మాడిచచ్చే ఘడియ ఇంకా రాలేదు!”

ఈ మాటలు వినగానే గ్రీకులకు చైతన్యం వచ్చినట్టయింది. వాళ్లు తమ ముఖాలకు అడ్డం పెట్టుకుని వుండిన బట్టలు తొలగించి, లేచి నిలబడి, రూపధరుడు తెచ్చిన దుప్పికేసి చూశారు. వాళ్లు చేతులు కడుక్కుని దుప్పిని వండటానికి ఉపక్రమించారు. చీకటి పడే వరకూ వారు తింటూ, తాగుతూ గడిపి, ఆ రాత్రికూడా తీరానే పడుకుని నిద్రపోయారు.

మర్నాడు తెల్లవారుతూనే రూపధరుడు తన అనుచరులను సమావేశపరిచి వారితో ఇలా అన్నాడు:

"మిత్రులారా, మనకీప్రదేశంకొత్త. తూర్పేదో, పడమర ఏదో కూడా తెలియదు. అలాటప్పుడు మనం ఏం చెయ్యాలి? నామటుకు నాకేమీ పాలుబోవటంలేదు. కాని చేతులు కట్టుకు కూచోలేం; ఏదో ఒకటి చెయ్యాలి. నేను ఈ సమీపంలో వున్న మిట్ట ఎక్కి చూశాను. ఇదొక లంక, కనుచూపు మేరలో ఎక్కడా మరొక తీరమన్నది నాకు కనిపించలేదు. ఈ లంక చూడబోతే ఇందులో కొండలూ గుట్టలూ ఆటే లేవు; లంకమధ్య చెట్లతోనూ, పొదలతోనూ కూడిన తోపు ఒకటి కనిపిస్తు న్నది. దాని మధ్య ఎవరో వున్నారు. ఎందుచేత నంటే ఆ తోపు నుంచి ఆకాశంలోకి పొగ లేవటం నాకు కనిపించింది!"

ఈ మాటలు వినగానే రూపధరుడి అనుచరుల గుండెలు చల్లబడ్డాయి. ఇలాటి పరిస్థితి లోనే వారు ఒకసారి ఫాలలోచనుల వాతా,



మరొకసారి నరభక్షకులైన రాక్షసుల వాతా పడి ఉన్నారు. వారు దుఃఖం ఆపుకోలేక కడవలుగా కన్నీరు కార్చసాగారు.

తరవాత రూపధరుడు తన అనుచరులను రెండు ముఠాలుగా విభజించాడు. ఒక ముఠాకు తాను నాయకుడుగా ఉండి, రెండవ ముఠాకు మాయావి అనే సాహసవంతుణ్ణి నాయకుడుగా పెట్టాడు. తోపులో ఉంటున్నదెవరో చూసి రావటానికి ఏ ముఠా వెళ్లాలనేది నిర్ణయించ టానికి రూపధరుడూ, మాయావీ వంతులు వేసుకున్నారు. వంతు మాయావిదయింది. వెంటనే మాయావి తన ఇరవై ఇద్దరు మనుషులనూ వెంటబెట్టుకుని గొణుగుతూ, సణుగుతూ బయలుదేరాడు.



వారు ఇంటిని సమీపించక తలవాకిలికి వెలుపలనే నిలబడి ఆలకించారు. ఇంటిలో మగ్గం నేస్తూ సుకేశిని శ్రావ్యంగా పాడుకుంటూ ఉండటం వారి చెవులపడింది. వారిలో ఒకడు, "మిత్రులారా, లోపల ఎవరో స్త్రీ మహచక్కగా పాడుతున్నది. అయితే మనిషి కావాలి, లేక పోతే దేవత కావాలి. ఆవిడతో మాట్లాడదాం! సందేహం దేనికీ?" అన్నాడు.

వెంటనే అందరూ గొంతులెత్తి లోపల ఉన్న స్త్రీని పిలిచారు. సుకేశిని బయటికి వచ్చి, వచ్చినవారిని చూసి, లోపలికి రమ్మని ఆహ్వానించింది. వారు ఆమె వెంట అమాయకంగా లోపలికి వెళ్ళారు. మాయావి మాత్రం సుకేశినిని చూడగానే ఏదో మోసం పసికట్టాడు. అందుచేత అతను బయటనే ఉండిపోయాడు.

కొంతదూరం వెళ్లగా అతనికి ఒక పల్లపు ప్రదేశంలో సుకేశిని ఉండే ఇల్లు కనిపించింది. అది చెక్కుడురాళ్లతో అందంగా కట్టి ఉన్నది. దానిచుట్టూ ఖాళీస్థలం ఉన్నది. ఇంటి చుట్టూ తోడేళ్ళూ,సింహాలూ మొదలైన అడవి జంతువులు ఉన్నాయి. ఇవన్నీ నిజంగా జంతువులు కావు, మనుషులే. సుకేశిని మనుషులకు మందులూ, మాకులూ పెట్టి జంతువులుగా మార్చివేసింది. అందుచేత ఆ జంతువులు మాయావి ముఠామీద విరుచుకుపడటానికి మారుగా, కుక్కల్లాగా తోకలాడిస్తూ అపేక్షగా వారిదగ్గరికి వచ్చాయి. కాని వాటి రహస్యం తెలియని గ్రీకులు ఆ మృగాలను చూసి బెదిరిపోయారు.

తన వెంట లోపలికి వచ్చిన వారందరికీ సుకేశిని రుచి అయిన ఆహారపదార్థాలూ, పానీయాలూ వడ్డించింది. అయితే ఆ పదార్థాలలో ఆమె ఏవోమందులు కలిపింది. అందుచేత గ్రీకులు ఆ పదార్థాలు తింటూనే ప్రపంచాన్ని మరిచారు. తరవాత ఆమె తన మంత్రదండంతో ఒక్కొక్కరినే తాకింది. వెంటనే వారంతా పందులరూపాలు ధరించి గోండ్రు పెట్టసాగారు. వారి రూపాలు పూర్తిగా మారిపోయాయి గాని, వారి మనసులు కొంచెం కూడా మారలేదు. సుకేశిని గ్రీకులను పందులమందగా మార్చేసి ఒక పందుల దొడ్డిలోకి

తరిమేసింది. వారా బందిఖానాలో ఉండి పందులు తినే ఆహారమే తినసాగారు.



సుకేశిని మాయలో పడక తప్పించుకున్న మాయావిమటుకుఒంటరిగా నౌకవద్దకు తిరిగి వచ్చాడు. చాలాసేపు అతని నోట మాటే రా లేదు.అతని కంటివెంట అశ్రుధారలు కారుతు న్నాయి. రూపధరుడు మొదలైనవారు ఎన్నో ప్రశ్నలు వేసినమీదట అతను తెప్పరిల్లి జరిగినది యావత్తూ వారికి ఇలా తెలియ జెప్పాడు:

"మీరు చెప్పిన ప్రకారమే మేము తోపుకేసి బయలుదేరి వెళ్ళాం. అక్కడ ఒక పల్లపు ప్రదేశంలో చక్కని రాతి ఇల్లు కనిపించింది. లోపల ఎవరో స్త్రీ మగ్గం నేస్తూ మనోహరంగా పాడటం వినిపించింది. మేము ఆమెను పిలిచాం. ఆమె వచ్చి అందరినీ లోపలికి తీసుకుపోయింది. ఏదో మోసం ఉందని తోచి నేను బయటే ఉండిపోయాను. లోపలికి వెళ్లిన మనవారి జాడ మరిలేదు!"

రూపధరుడీ వార్త వింటూనే చివాలున లేచి తన పెద్దకత్తి — వెండి బుడిపెలు గల కంచు కత్తి — తీసుకుని, విల్లంబులు చేత బట్టి, "ఆ ఇంటికి దారి చూపింతువుగాని, నా వెంట బయలుదేరు!" అన్నాడు. మాయావి రూపధరుడి కాళ్లు వాటేసుకుని, "నాయకా, నన్నక్కడికి రమ్మనకండి! మీకు వెయ్యి దణ్ణాలు!నేనుఅక్కడికి రాను,ఇక్కడేఉంటాను. మీరు తిరిగి రారు. నాకు తెలుసు! మీవెంట వచ్చానంటే నాపనీ అంతే అవుతుంది.నాలుగు కాలాలపాటు మీరూ, నేనూ, మిగిలినవాళ్లమూ బతికివుండాలన్న కోరిక ఏమైనా ఉంటే, ఈ దిక్కుమాలిన చోటు వదిలి వెళ్ళిపోదాం, పదండి!" అని ప్రాథేయపడ్డాడు.

"సరే, మాయావీ, నీ ఇష్టం! నువ్వు పడవ వద్దనే ఉండి తిను, తాగు! నేను మాత్రం వెళతాను, వెళ్ళి తీరాలి!"అన్నాడు రూపధరుడు.

అతను పల్లపు ప్రాంతానికి వచ్చి, దిగువగా వున్న సుకేశిని ఇల్లు చూసే సమయాన ఒక యువకుడు అతనికి ఎదురువస్తూ ఆగి, "పాపం, మళ్లీ ఎక్కడికి బయలుదేరుతున్నావు, నాయనా? ఆ కనిపించే ఇల్లు సుకేశినిది తెలుసా? నీమనుషులందరూ అక్కడ పందుల



రూపంలో నిర్బంధించబడి వున్నారు. నువ్వు కూడా వారిని చేరబోతున్నావా?... అయినా భయంలేదు,నేను చెప్పినట్టు చెయ్యి. నీకొక మూలిక ఇస్తాను. సుకేశిని నీ పానీయంలో మందు కలిపి ఇస్తుంది. ఈ మూలిక ప్రభావంచేత ఆ మందు నీమీద పని చెయ్యదు. తరవాత నిన్ను ఆమె మంత్రదండంతో తాకుతుంది.నువ్వు వెంటనే కత్తిదూసి, చంప బోయేవాడిలాగా ఆమెపైకి ఉరుకు. ఆమె భయపడిపోయి, నీకు భార్యగా ఉంటానం టుంది. దీనికి నువ్వు ఒప్పుకోవచ్చు. కాని ముందుగా నువ్వు ఆమెచేత దేవతలమీద ప్రమాణం చేయించి, నీకు ఎట్టి అపకారమూ చేయనని మాట తీసుకో,"అంటూ నేలమీది నుంచి ఒక చిన్న మొక్క పీకి రూపధరుడి కిచ్చాడు. ఆ మొక్కవేరు చాలానల్లగా వున్నది. కాని దానిపువ్వు స్వచ్ఛమైన తెలుపు రంగులో ఉన్నది.

యువకుడు వెళ్ళిపోయాక రూపధరుడు దీర్ఘాలోచనలో మునిగిపోయి అడుగులో అడుగు వేసుకుంటూ సుకేశిని ఇల్లు చేరి, గట్టిగా కేకపెట్టాడు. వెంటనే సుకేశిని బయటికి వచ్చి తలుపు తెరిచింది. అతను ఆమె వెంట లోపలికి వెళ్లాడు. కాని అతని గుండె గుబగుబలాడుతూనే ఉంది.

ఆమె అతన్ని ఒక నగిషీ చేసిన కొయ్య కుర్చీలో కూర్చోబెట్టి, కాళ్లకింద పాదపీట పెట్టింది. తరవాత లోపలికి వెళ్లి, మందు కలిపిన పానీయం తెచ్చి అతని ముందు వుంచింది. రూపధరుడు దానిని తాగేశాడు గాని, మూలికా ప్రభావంవల్ల మందు అతని మీద పని చెయ్యలేదు.

సుకేశిని కీ సంగతి తెలియదు. ఆమె మంత్రదండంతో అతనిని తాకుతూ, "వెళ్లు, పందుల కొట్టంలో ఉండే నీ అనుచరులను చేరు!" అన్నది.

వెంటనే రూపధరుడు కత్తిదూసి ఆమె పైకి లంఘించాడు. ఆమె భయంతో వణికి పోతూ, అతని కాళ్లు పట్టుకుని, "ఎవరు నీవు? ఈ విశాల ప్రపంచంలో ఏ ప్రాంతం నుంచి వస్తున్నావు? మీ నగరం పేరేమిటి? నీ తల్లిదండ్రు లెవరు? నా మందు నాలుకకు

తగిలినాక కూడా మారకుండా ఉండటం మామూలు మనుషుల తరం కాదు. నువ్వు రూపధరుడివై వుండాలి. రూపధరుడు నన్ను చూడవస్తాడని ముందుగానే దేవతలు నాతో అన్నారు. మనిద్దరికీ వైరం వద్దు. ఆ కత్తి అవతల పెట్టేసి నన్ను పెళ్లాడు. మనిద్దరమూ సఖ్యంగా వుందాం!" అన్నది.

"నా అనుచరులను పందులుగా మార్చేసి కొట్టంలో బంధించిన నీతో నాకు సఖ్యం ఎలా పొసగుతుంది? నన్నుకూడా పందిగా మార్చాలని ప్రయత్నించి, అది సాగకపోయే సరికి, నాభార్యనవుతానంటావా? నాకు మరే అపకారమూ తలపెట్టనని ప్రమాణం చేస్తే, నీతో సఖ్యంగా వుండటానికి నేను సమ్మతిస్తాను," అన్నాడు రూపధరుడు.

సుకేశిని ఆ ప్రకారమే ప్రమాణం చేసింది. తరవాత ఆమె పరిచారికలు రూపధరుడికి చక్కగా తలంటి స్నానం చేయించారు. అతనికీ, తమ యజమానురాలికీ భోజనం వడ్డించారు. కాని రూపధరుడు ఆ ఆహారాన్ని ముట్టలేదు.

"ఎందుకు సందేహిస్తున్నావు? మళ్లీ ఏదైనా మోసం చేస్తాననా? చెయ్యనని ప్రమాణం చేశాను కానా?" అన్నది సుకేశిని.

"నా అనుచరులు, పందులరూపంలో వుండగా ఈవిందు ఎలాఆరగించేది? వారిని మామూలు మనుషులను చేసి నా ఎదటికి తెచ్చినదాకా నా మనస్సుకు శాంతి ఉండదు!" అన్నాడు రూపధరుడు.

సుకేశిని తన మంత్రదండం తీసుకుని వెళ్లి, రూపధరుడి అనుచరులందరినీ యధాప్రకారం మనుషులను చేసి వెంటబెట్టుకు వచ్చింది.రూపధరుణ్ణి చూడగానే వారి ఆనందానికి మేరలేదు. వారిలో చాలామందిసంతోషం పట్టలేక ఏడిచారు.

సుకేశిని రూపధరుణ్ణి సమీపించి,"నేను చెప్పినట్టు చెయ్యి. సముద్రతీరానికి వెళ్లు. నీ పడవను తీరం మీదికి లాగించి,నీసామానూ తాళ్లూ ఒక గుహలో భద్రం చేయించు. తరవాత, నీ మిగిలిన అనుచరులను కూడా వెంటబెట్టుకుని ఇక్కడికి రా!"అన్నది. రూపధరుడు సరేనన్నాడు. —(ఇంకావుంది)



# చేతికర్ర

హేలాపురిలో రామావతారం సామాన్య గృహస్థు. ఒకనాడాయన భార్య ఏవో సరుకులు తెమ్మని పంపింది. రామావతారం నగరంలో చాలా దుకాణాలు తిరిగి, భార్య చెప్పిన సరుకులన్నీకొన్నాడు. తీరా ఆ సరుకులన్నీ కూలివాడితో ఇంటికి మోయించుకొస్తూండగా, రామావతారం తన చేతికర్ర చేతిలో లేకపోవడం గమనించాడు.

ఆ చేతికర్రను, తను సరుకులు కొన్న ఏ దుకాణంలోనో మరిచిపోయి వుంటానని, రామావతారం వాడిని వెంటబెట్టుకుని, ప్రతి దుకాణానికీ వెళ్ళి, తన చేతికర్ర గురించి వాకబు చేశాడు. కానీ ఏ దుకాణంలోనూ చేతికర్ర దొరకలేదు.

రామావతారం విసిగిపోయి తిరిగి వస్తూండగా, తను సరుకులు కొన్న మరొక దుకాణం కనిపించింది. అతడు అక్కడికి వెళ్ళి, తన చేతికర్ర గురించి అడిగాడు.

ఆ దుకాణం వాడు, పక్కనే గోడకు ఆనించి వున్న చేతికర్రను తీసి రామావతారానికిస్తూ, "అయ్యా, ఇదేగదా తమ చేతికర్ర?" అన్నాడు.

రామావతారం పరమానందంతో చేతికర్రను అందుకుని, "హేలాపురిలో వున్న దుకాణదారులందరిలోనూ, మీరొక్కరే నిజాయితీపరులు. మిగతా వాళ్ళందరూ, నా చేతికర్ర లేదంటే లేదన్నారు!" అంటూ దుకాణంవాణ్ణి మెచ్చుకున్నాడు.

ఇది విని దుకాణంవాడు తెల్లబోయాడు. —కోనే నాగవెంకట ఆంజనేయులు






# విమలుడి విజయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వు ఇంత అర్ధరాత్రివేళ, కన్నుపొడుచుకున్నా కానరాని కటిక చీకట్లో కార్యసాధన కోసంపడుతున్న శ్రమ చూస్తూంటే, నువ్వు మహా శక్తివంతుడివీ, సర్వవిద్యాపారంగతుడివీఅయివుంటావన్నఅనుమానంకలుగుతున్నది. అయితే, అటువంటివారు కూడా ఏదో ఒకనాడు తమ ఆధిక్యతను మరిచి అల్పులకు తలవంచడం జరుగుతుంది. ఇందుక్కారణం ఎదుటివాడి శక్తి సామర్థ్యాలను సరిగా అంచనా వెయ్యలేకపోవడం కావచ్చు. మార్పులేని గానుగఎద్దు జీవిత సరళి కావచ్చు. పైబడుతున్న వయోభారం కావచ్చు. కారణం ఏదైనా, ఇలాంటిది ఒకనాటి వాళ్ళ ఔన్నత్యానికి మచ్చగా మిగిలి

## బేతాళ కథలు



పోతుంది. నువ్వూ ఏదో ఒకనాడు ఇలాంటి స్థితికి దిగజారిపోకుండా వుండేందుకు తగు హెచ్చరికగా విమలుడు, ప్రతాపుడు అనే వాళ్ళ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

వల్లభాపురంలో నివసించే విమలుడనే యువకుడికి రాని విద్యంటూ లేదు. వాడు బాల్యం నుంచీ పట్టుదలగా పండితుల వద్ద శాస్త్ర సాహిత్య గాన కళలూ, నిపుణులైన యోధుల వద్ద అస్త్ర శస్త్ర గదా విద్యలూ నేర్చుకున్నాడు. ఈ కారణంగా వాడు మిడిసి పడుతుంటే తండ్రి వాడితో, "నువ్వు విజయ నగరంలో వున్న ప్రతాపుడి సంగతి వినలేదా? ఆయన కూడా గొప్పవారిచేత అన్ని శాస్త్ర విద్యల్లోనూ అగ్రగామి అనిపించుకున్నాడు," అని చెప్పాడు.

ఇది విని విమలుడు, ప్రతాపుడితో పోటీ చేయాలని విజయ నగరం వెళ్ళాడు. అక్కడ మల్లుడొకడు వాడికి తారసపడి, సంగతి తెలుసుకుని, "మల్లయుద్ధ పోటీలలో ఇప్పటికి నాలుగు సార్లు ప్రతాపుడి మీద ఓడి ఎన్నో కొత్త మెలకువలు నేర్చుకున్నాను. ముందు నన్నోడించు. ఆ తర్వాతనే ప్రతాపుడి మీదికి వెళ్ళు," అన్నాడు.

విమలుడు, మల్లుడితో తలపడ్డాడు. మల్లుడు వాణ్ణి అవలీలగా ఓడించాడు. విమలుడు వాడి వద్ద శుశ్రూష చేసి కొత్త మెలకువలు నేర్చుకుని నాలుగు రోజుల్లోనే వాడినోడించ గలిగాడు. మల్లుడు విమలుణ్ణి మెచ్చుకుని, "నువ్వు తప్పక ప్రతాపుణ్ణి ఓడించ గలవు!" అన్నాడు.

నాలుగు రోజుల తర్వాత విమలుడు, ప్రతాపుణ్ణి మల్లయుద్ధ పోటీకి పిలిచాడు. ప్రతాపుడు వాణ్ణి అవలీలగా ఓడించి, "నువ్వు ఓడిపోయినా ఇందులో కొన్నిపట్లుబాగా ఎరిగిన వాడివి. నీకు మంచి భవిష్యత్తు వుంది. నా దగ్గర శిష్యుడుగా చేరు," అని ఆహ్వానించాడు.

విమలుడు ఉక్రోషంగా, "నాలాగే నువ్వూ ఎన్నో విద్యలు నేర్చినవాడివి. అందులో ఏదో ఒకదానిలో నైనా నిన్నోడిస్తే తప్ప, నీ దగ్గర శిష్యుడుగా చేరను," అని వెళ్ళిపోయాడు.

విజయనగరంలో వీరసేనుడనే యోధుడు న్నాడు. కత్తియుద్ధంలో అతడికి గొప్ప ప్రావీణ్యం వుంది. అయితే, లోగడ కత్తియుద్ధంలో అతడు ప్రతాపుడి చేతిలో సులభంగా ఓడిపోయాడు. తనకు వయసు మీరిందనీ యువకుడికెవరి కైనా శిక్షణ ఇచ్చి, వాడిచేత ప్రతాపుణ్ణి ఓడింప చేయాలనీ వీరసేనుడనుకుంటున్నాడు. అతడు విమలుణ్ణి గురించి విని పిలిపించి, కత్తి యుద్ధంలో వాణ్ణి పరీక్షించి తృప్తి పడ్డాడు. కానీ కొన్నాళ్ళ శిక్షణ తర్వాత విమలుణ్ణి, ప్రతాపుడి మీదికి పోటీకి పంపితే — ప్రతాపుడు వాణ్ణి క్షణాల మీద చిత్తుగా ఓడించాడు.

ఇంత జరిగాక విమలుడు బాధపడుతూ, "నేను చాలా గొప్పవాణ్ణని లోగడ అనుకునే వాణ్ణి. విజయనగరంలో నన్ను మించిన వాళ్ళు చాలా మంది వున్నారు. వాళ్ళ వద్ద మల్ల, కత్తి యుద్ధాల్లో మెలకువలు నేర్చుకున్నాక, ఇక నా అంతటి వాడు వుండడనే అనిపించింది. అయినా ప్రతాపుడు నన్నోడించ గలగడం ఆశ్చర్యంగా వుంది. నమ్మశక్యం కాకుండా వుంది," అనుకున్నాడు.

ఆ తర్వాత వాడు అదేవిధంగా గదా యుద్ధంలో, విలువిద్యలో ప్రతాపుడి చేతిలో ఓడిపోయి, "ఆదిలో మీ గొప్పతనాన్ని గుర్తించలేకపోయాను. నన్ను మీ శిష్యుడిగా స్వీకరించండి!" అనికోరాడు.

దానికి ప్రతాపుడు నవ్వి, "నువ్వు మహా వీరుడివనడంలో సందేహం లేదు. నిన్ను నేను తప్పక శిష్యుడుగా స్వీకరిస్తాను. కానీ





నువ్వు మొదట నాతో అన్నమాట ప్రకారం ఏదో ఒక విద్యలో నన్నోడించి, నన్ను నీ శిష్యుడిగా చేర్చుకోవాలి. అప్పుడే నిన్ను నేను మిగతా విద్యల్లో శిష్యుడుగా స్వీకరి స్తాను," అన్నాడు.

విమలుడు, ప్రతాపుణ్ణి బ్రతిమాలాలనుకు న్నాడు. కానీ అందుకు అహం అడ్డువచ్చింది. ప్రతాపుణ్ణి ఒక్కటంటే ఒక్క విద్యలోనైనా ఓడించాలని వాడికి పట్టుదల కలిగింది. కానీ అది సాధ్యపడదని వాడు గ్రహించాడు. దానితో వాడికి అంతులేని మనోవ్యధ కలిగి, ఆత్మహత్య చేసుకోవాలని నగర సమీపాన వున్న నదీ తీరానికి వెళ్ళాడు. అక్కడవాడికి ఒక యోగి కనిపించి, వాడిని దిగులుకు కారణం అడిగాడు. విమలుడు దాచకుండా అంతా చెప్పాడు.

"నాయనా! నీ ముఖంలో దివ్యతేజస్సు వుంది. వేదాంత విద్యను అభ్యసించు. అందులో నిన్నెవ్వరూ ఓడించ లేరు. చివరకు ప్రతాపుడంతటి వాడు కూడా, నీ ముందు ఓటమిని అంగీకరించ గలడు," అన్నాడు యోగి.

విమలుడికి తిరిగి ఉత్సాహం వచ్చింది. వాడు ఆరు నెలల పాటు యోగి వద్ద వేదాంతసారం గ్రహించాక, ఆయనను, "స్వామీ! వేదసారం అనంతం. అయితే నాకి ప్పటికి జ్ఞానోదయమయింది. నేను ప్రతాపుణ్ణి కలుసుకునేందుకు అనుమతి ఇవ్వండి," అని కోరాడు.

"విజయోస్తు!" అన్నాడు విమలుడిని దీవిస్తూ యోగి.

విమలుడు నగరానికి తిరిగి వచ్చి, ప్రతా పుణ్ణి కలుసుకో గోరుతున్నట్టు కబురంపాడు. ఆ సరికి విమలుడి వేదాంతజ్ఞానం గురించి కొంత తెలుసుకుని వున్న ప్రతాపుడు మనసులో నవ్వుకుని, వాడిని ఆహ్వానిస్తూ కబురు చేశాడు.

ప్రతాపుడితో విమలుడు వేదాంత చర్చ చేయబోతున్నాడన్న వార్త, కార్చిచ్చులా నగరమంతా వ్యాపించింది. ఈ విశేషాన్ని చూసేందుకు పండితులూ, పామరులూ కూడా చాలా మంది వచ్చారు. అంతవరకూ

ప్రతిసారీ విమలుడే ఓటమిని చవి చూసినా, వాడి ముఖంలోని పట్టుదలా,తేజస్సూ చాలా మందిని ఆకర్షించాయి.ప్రతాపుడంతటి వాడు కాకపోయినా, అన్ని విద్యల్లోనూ చెప్పుకో తగ్గప్రావీణ్యముండడంవిమలుడిప్రత్యేకతగా అందరూ గుర్తించి, ఏదో ఒక రోజున వాడు విజయాన్ని చవిచూడాలని మనసులో కోరు కుంటున్నారు.

అనుకున్న సమయానికి సభ ప్రారంభమ యింది. ముందుగా ప్రతాపుడు, విమలుడి నుద్దేశించి, "నువ్వు మల్లయుద్ధ పోటీల్లో, కత్తియుద్ధంలో, గదాయుద్ధంలో, ధనుర్వి ద్యలో, శాస్త్రచర్చలో నా చేతిలో ఓడిపోయావు. ఇప్పుడు వేదాంతసారం విషయంలో నువ్వు తెలుసుకున్నదేమిటో, నాకు చెప్పు. దానికి నేను ఎంతో కొంత విపులీకరణ రూపంలోనో, వ్యాఖ్యాన రూపంలోనో, జత పరచగలిగితే, నువ్వు ఓడినట్లు. లేదా నేనోడినట్లు. సరేనా?" అన్నాడు ఉత్సాహంగా.

ఇందుకు విమలుడు మందహాసం చేసి, "ఆర్యా! వేదాంతసారం గ్రహించాక, నేనేమిటో తెలుసుకున్నాను. ఈ ప్రపంచంలో మనకు తెలిసింది అల్పం; తెలియనిది అనల్పం. మీకు తెలిసిన పాటి తెలియని నేను సర్వం తెలుసుననుకుంటూ విర్ర వీగాను. నా అజ్ఞానాన్నీ, అహంకారాన్నీ మన్నించండి. నన్ను మీ శిష్యుడిగా స్వీకరించండి. అనంతమైన వేదాంతసారాన్ని గురించి చెప్ప



మని మాత్రం నన్నడక్కండి. అది నా వల్ల కాదు," అన్నాడు.

ఈ మాట వింటూ ప్రతాపుడు నివ్వెర బోయి, "ఎన్నో విద్యలు నేర్చాను. ఎందరెం దరినో మించాను.వేదాంతసారం కూడా ఔపో సనపట్టానని భావిస్తూనే, అహంకారాన్ని జయించలేకపోయాను. ఎదుటి వాడి గొప్ప తనాన్ని అంగీకరించే వినయాన్ని వేదాంత సారం నీకిచ్చింది కానీ నాకివ్వలేదు. నువ్వు నన్ను ఈ విషయంలో శిష్యుడిగా స్వీకరించు. మిగతా విషయాల్లో నేను నిన్ను శిష్యుడిగా స్వీకరిస్తాను," అన్నాడు.

బేతాళుడుఈకథచెప్పి,"రాజా, విమలుడూ, ప్రతాపుడూ ప్రవర్తించిన తీరు చూస్తూంటే,

ఇందులో నాకు మాటల గారడీ, వాక్చాతుర్యం, పరస్పరప్రశంసా, మూల విషయాన్ని మరింత జటిల పరచడం తప్ప, మరేం కనబడడం లేదు. లోకంలో కొందరు పండితులూ, తార్కికులూ లాగా ఏది సందర్భోచితమో మరిచి పదాలను పడికట్టురాళ్ళ స్థాయికి దిగజార్చినట్టు కనబడుతున్నది. ఏ విధంగా చూసినా ప్రతాపుడి ప్రజ్ఞాప్రాభవాల ముందు విమలుడు చాలా అల్పుడు. అయినా ప్రతాపుడు, విమలుణ్ణి తనతో సరితూగగల జ్ఞాని అన్నట్లు ప్రశంసిస్తున్నాడు. ఇందుకు కారణం అతడు విమలుడి వేదాంత జ్ఞానాన్ని సరిగా అంచనా వెయ్యలేకపోవడమే గదా? అంతేకాక, వారిద్దరిలో ఎవరు గొప్పవారో, ఎవరు ఎవరి చేతిలో ఓడిపోయారో కూడా తెలియడంలేదు. ఇంతకూ విజయం ఎవరిది? విమలుడిదా లేక ప్రతాపుడిదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీతలపగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఎదుటి వాడి జ్ఞాన పాండిత్యాల స్థాయిని మరొక జ్ఞానీ, పండితుడైన వాడే నిర్దుష్టంగా అంచనా వేయగలడు. అందువల్ల, సర్వ విద్యా పారంగతుడైన ప్రతాపుడు, విమలుడి వేదాంత జ్ఞానాన్ని సరిగానే అంచనా వేశాడనుకోవడం వాస్తవమవుతుంది. గొప్పవాడి ఓటమి తను గొప్పవాడనుకోవడంలో వున్నది. తక్కువ వాడి గెలుపు, ఎదుటి వాడి గొప్పతనాన్ని అంగీకరించడంలో వున్నది. ప్రతాప విమలుల స్పర్థకు అంతం వేదాంతసారంలో వున్నది. వేదాంతసారం ఎరిగినవాడెవ్వడూ, తన గొప్పతనాన్ని నిరూపించుకునేందుకు ఎదుటి వాడితో పోటీపడడు. వేదాంతి తన జ్ఞానాన్ని ఇతరులకు పంచిపెడతాడు. తనకు తెలియని విషయాలను, ఇతరుల నుంచి నేర్చుకుంటాడు. ఆ కారణం చేత, ముందుగా ఈ సత్యాన్ని గ్రహించిన విమలుడిదే విజయం," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]





# కావ్యసృష్టి

సౌవీరదేశపు రాజు చాలా సమర్థుడు. ఆయన పాలనలో ఏనాడూ లేని సుఖశాంతులు ప్రజల కులభించాయి. రాజు కొలువులో భౌతిక, రసాయనిక, వృక్షశాస్త్రజ్ఞులతో పాటు, మహా కవులుగా పేరు ప్రఖ్యాతులు గడించిన మరి కొందరుండేవారు.

ఒకనాడు రాజు సభచేసి వుండగా, శాస్త్రజ్ఞులు తాము ఉమ్మడిగా చేసిన పరిశోధనల ఫలితాలను సభకు నివేదించారు. వారు సాధించిన విజయపరంపరలను రాజుతో పాటు, సభలోని అందరూ చాలా మెచ్చుకున్నారు.

ఆ సమయంలో ఒక కవి ఆశువుగా, వారి విజయానికి కారకుడైన తమ రాజును బృహస్పతితో పోల్చుతూ ఒక చక్కని పద్యం చెప్పాడు.

ఇది విన్న రాజుకు ఒక వింత ఆలోచన వచ్చింది: వైజ్ఞానికరంగంలో అందరూ సమిష్టిగా కృషిచేసి ఒక మహత్కార్యాన్ని సాధిస్తున్నట్లు, ఒక మహాకావ్యాన్ని విజ్ఞానవేత్తలు, కవులు కలిసి ఎందుకు రాయకూడదు? వెంటనే ఆయన సభలో వున్న శాస్త్రజ్ఞులూ, కవులూ కలిసి, తనమీద ఒక కావ్యం రాయాలని ఆదేశించాడు.

ఇది విని ఒక్క క్షణం ఆశ్చర్యపోయిన మంత్రి గొంతు సవరించుకుని ఏదో చెప్పబోయేలోపలే, రాజు సభ చాలించి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత నెల రోజులకు సభలో శాస్త్రజ్ఞులూ, కవులూ కలిసి రచించిన పద్యాలను చదవడం ప్రారంభించారు.

కొద్ది సేపటికే సభలో కలకలం మొదలయింది. కావ్యం అతుకుల బొంతలాగా తయారైంది. నవరసాలు వుండవలసినచోట మచ్చుకైనా లేవు. శృంగారం ఉండవలసిన చోట రౌద్రం, శాంతంకు బదులు బీభత్సం,

రామవరపు గణేశ్వరరావు

కరుణరసం వుండవలసిన చోట హాస్యం వున్నాయి.

రాజు కొద్దిసేపు ఆ పద్యాలు విని చిరాకు పడుతూ, ఇక చదవవద్దని ఆజ్ఞాపించి, సభ చాలించి వెళ్ళిపోయాడు.

ఆ నాటి సాయంత్రం రాజు ఉద్యానంలో ఉండగా, మంత్రి ఆయనను చూడబోయాడు. మంత్రి తనను సమీపిస్తూండగానే రాజు, "మహామంత్రీ! ఏమిటీ రసాభాస? మన ఆస్థానంలో దిగ్దంతుల వంటి కవులూ, శాస్త్ర వేత్తలూ వున్నారు గదా. వారందరూ కలిసి సమాలోచన చేసి కావ్యసృష్టికి పూనుకున్నప్పుడు ఆ కావ్యం బృహస్పతి అంతవాడు కూడా, 'ఆహాఁ, అద్భుతం,' అన్నట్లుండాలి. అది జరగక్కపోగా, చేపల బుట్టల్లినట్టు, ఈ ఉద్దండులందరూ కలిసి పద్యాలు అల్లేశారు. ఇందుకుకారణం ఏమైవుంటుంది?" అన్నాడు ఆశ్చర్యంగా.

దానికి మంత్రి, "మహాప్రభూ! ఆరోజే తమకు ఒక విషయం విన్నవించుదామనుకున్నాను. కాని, తమరు సభనుంచి వెళ్ళిపోయారు. క్షమించండి ప్రభూ! కళ వేరు, విజ్ఞానశాస్త్రం వేరు. ఒక వ్యక్తి కళాత్మకమైన మహాకావ్యాన్ని సృష్టిస్తాడు. కాళిదాసు మేఘ సందేశం రాసి వుండకపోతే, ఆ కావ్య రచన ఇంకొకరివల్ల జరిగేదికాదు. శ్రీహర్షుడి నైషధం ఆయనతోపోయి వుంటే — అది మన జాతికే తీరనినష్టంగా పరిణమించేది. దానిని మరొక కవి ద్వారా పొందడం అసాధ్యం. కాని, ఖగోళ శాస్త్రాన్ని వరాహమిహిరుడు చెప్పకపోయినా, మరెవరో మిహిరవరాహుడి ద్వారా తెలుసుకునే వాళ్ళం. ఒక మహాకావ్యం కేవలం ఒకే వ్యక్తి సృజనాత్మక శక్తికి, అద్భుత సృష్టికి తార్కాణం. అలాగే వైజ్ఞానికరంగంలో, సమర్థులైన శాస్త్రజ్ఞులు అందరూ కలిసి ఫలితాలు సాధించవచ్చు. కాని, కావ్య సృష్టి ఏనాడూ సమిష్టి కృషివల్ల జరగదు, ప్రభూ!" అన్నాడు.

మంత్రి ఇలా చెప్పిన తర్వాత రాజుకు, తన ఆస్థాన శాస్త్రజ్ఞులూ, కవులూ కలిసి రాసిన దానిలో కావ్యలక్షణాలు ఎందుకు లేకుండా పోయినవో అర్థమయింది.



మనదేశపు కోటలు — 9

# చారిత్రక జ్ఞాపికలు

రచన : మీరా ఉగ్రా ❀ చిత్రాలు : అరిత్రా

పదహారవ శతాబ్దారంభంలో యూరోపియనులు మనదేశానికి రావడం ప్రారంభించారు. తమ కర్మాగారాల పరిరక్షణ కోసం వాళ్ళు మొదట కోటలు నిర్మించారు.

మద్రాసులోని సెయింట్ జార్జికోట 1640 - 1654 మధ్య నిర్మించబడింది. కూవంనది బంగాళాఖాతంలో కలిసే చోట ఈ కోట నిర్మాణం జరిగింది. ఆ విధంగా దీనికి రెండు వైపులా సహజ సిద్ధమైన జలరక్షణలు ఏర్పడ్డాయి. మూడో వైపు అగడ్త తవ్వారు. మొగలులు, మహారాష్ట్రులు, ఫ్రెంచివాళ్ళు దీనిని పలు సార్లు ముట్టడించారు. 1758వ సం॥లో ఫ్రెంచి సేనలు మూడు వైపులా ఫిరంగులతో కోటను చుట్టుముట్టి కాపలా భటులను రెండు నెలలపాటు వేధించాయి. ఆ తరవాత ఆంగ్లేయ సేనలకు, బెంగాల్ నుంచి సాయం రావడంతో, బెదిరిపోయిన ఫ్రెంచి సేనలు 52 ఫిరంగులనూ, గాయపడిన సైనికులనూ అక్కడే వదిలి పారిపోయాయి. ఆ అనుభవంతో ఆంగ్లేయులు, ఈ కోటను వూల్విచ్ గణిత శాస్త్రజ్ఞుడు బార్తోలోమ్యూ రాబిన్స్ పర్యవేక్షణలో మరింత పటిష్ఠంగా పునర్నిర్మించారు.

పదేళ్ళ తరవాత, మైసూర్ నుంచి హైదర్ అలీ మద్రాసుకేసి



మొట్టమొదటి రాజకీయ వ్యంగ్యచిత్రం!



సెయింట్ జార్జ్ కోట, మద్రాసు


విలియం కోట బురుజు

సేనలను నడిపించాడు. 1769 ఏప్రిల్ 4వ తేదీ ఉభయుల మధ్య ఏర్పడిన ఒడంబడికకు తనే నిబంధనలు విధించాడు. పోతూ పోతూ కోట గోడ మీద చెరగని ఒక వ్యంగ్యచిత్రాన్ని వేయించి మరీ వెళ్ళాడు. హైదర్ అలీ ఒక ఇంగ్లీషు గవర్నర్ ముక్కు పట్టి లాగుతున్నట్టున్న ఈ చిత్రమే ఆధునిక కాలంలో, అంటే – పాశ్చాత్య దేశాలలో సైతం ఈ కళ ప్రాచుర్యంపొందడానికి ముందే – చిత్రించబడిన మొట్టమొదటి రాజకీయ వ్యంగ్యచిత్రం అని చెప్పవచ్చు.

ఈ కోటలోని సెయింట్ మేరీస్ చర్చ్ మనదేశంలో నిర్మించబడిన మొట్టమొదటి ఆంగ్లికన్ చర్చ్. ఇది మొదట 1678వ సం॥లో నిర్మించబడింది. 1758లో పునర్నిర్మాణం జరిగింది.

ప్రస్తుతం ఈ కోట ఆవరణలోనే తమిళనాడు శాసనసభాభవనం, రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యాలయం ఉన్నాయి.

ఈస్టిండియా కంపెనీకి చెందిన సర్జన్ గేబ్రియల్ బౌటన్ — యువరాణి జహానారా శరీరం మీది కాలిన గాయాలకు వైద్యం చేసి మాన్పాడు. యువరాణి తండ్రి షాజహాన్ కృతజ్ఞతా భావంతో, ప్రత్యుపకారంగా — కంపెనీకి బెంగాల్‌లో స్వేచ్ఛగా వ్యాపారం చేసుకునే హక్కు ఇచ్చాడు. ఇది జరిగింది 1644వ సం॥లో. మరికొన్నాళ్ళకు ఆ డాక్టరే, ఆ కాలంలో బెంగాల్ వైస్రాయ్‌గా వున్న యువరాజు షుజా రాజ కుటుంబానికి చెందిన ఒక స్త్రీకి వైద్యం చేశాడు. దానికి బహుమతిగా 'కాలికాట' దగ్గర కోట నిర్మాణానికి అనుమతి లభించింది. కలకత్తాలోని విలియం కోట నిర్మాణానికి పదకొండేళ్ళు పట్టింది. 1707వ సం॥లో కోట నిర్మాణం పూర్తయింది.

బెంగాల్ ప్రాంత వ్యవహారాలలో రోజురోజుకూ కంపెనీ జోక్యం పెరగడం యువరాజు సిరాజ్ ఉద్దౌలాకు నచ్చలేదు. అందువల్ల, నవాబు అనుమతి పొందకుండా విలియం కోటను మరింత పటిష్ఠం చేయడం గాని, కోట గోడల మీద ఫిరంగులు అమర్చడంగాని చేయకూడదని ఆయన ఆక్షేపించాడు. అగ్నిలో ఆజ్యం పోసినట్టు, ఆంగ్లేయులు ఆయన పోటీదారుకు సింహాసనం అధిష్ఠించడానికి

విలియం కోట, కలకత్తా

సిరాజ్ - ఉద్దౌలా

సాయపడ్డారు. కాబట్టి ఆయన తాత అనంతరం సింహాసనం అధిష్ఠించి నవాబు అయిన తరవాత మొట్టమొదటి పనిగా 1756వ సం॥ ఏప్రిల్‌లో విలియం కోట మీదికి దండెత్తి వెళ్ళాడు.

సిరాజ్ ఉద్దౌలా సేనలు సమీపించగానే గవర్నర్ డ్రేక్, మరికొందరు ఉన్నతాధికారులు కోటనుంచి పారిపోయి లంగరు దించిన ఓడలో తల దాచుకున్నారు. రక్షకులు లేని కోట 1756 జూన్ 20వ తేదీ సిరాజ్ ఉద్దౌలా వశమయింది. ఆరోజు సాయంకాలం — పురుషులు, స్త్రీలు, పిల్లలు అంతా కలిసి 146 మంది ఇంగ్లీషువారు బందీలుగా దొరికారు. వాళ్ళందరినీ ఒకే చిన్న గదిలో బంధించారు. తెల్లవారి చూస్తే వారిలో 23 మందే ప్రాణాలతో ఉన్నారు. ఆ దుర్ఘటన జరిగిన గదిని 'బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తా'గా చెప్పుకుంటారు. నవాబు చర్యను బ్రిటిష్ వాళ్ళతో పాటు అందరూ తీవ్రంగా ఖండించారు. అయినప్పటికీ, ఆధునిక చరిత్రకారులు మాత్రం ఆ దుర్ఘటనకు సిరాజ్ ఉద్దౌలా ప్రత్యక్షంగా బాధ్యుడు

ఈస్టిండియా కంపెనీ అధికారితో మొగలు చక్రవర్తి రెండవ షా ఆలం.

కాదని భావిస్తున్నారు. ఇంకా కొందరు ఆ గదిలో బంధించబడిన బందీల సంఖ్య గురించీ, మరణించినవారి సంఖ్య గురించీ కూడా అనుమానాలు వ్యక్తం చేస్తున్నారు.

ఒక సంవత్సరం తరవాత జరిగిన ప్లాసీయుద్ధం పరిస్థితిని తల్లకిందులు చేసింది. 1765 ఆగస్టు 17 తేదీ మొగలు చక్రవర్తి రెండవ షా ఆలం ఫర్మానా జారీ చేసి — బెంగాల్, బీహార్, ఒరిస్సా ప్రాంతాలలో పన్నులు వసూలు చేసే హక్కును ఈస్టిండియా కంపెనీకి ధారాదత్తం చేశాడు.

'హిందూస్థాన్ మొత్తం దండెత్తి వచ్చినా విలియం కోటను పట్టుకో

రాబర్ట్ క్లైవ్

జాలదని ఉత్తరోత్తరా దానిని గురించి రాబర్ట్ క్లైవ్ గొప్పగా చెప్పుకోవడం కూడా జరిగింది. ఇప్పుడాకోట భారతీయ సైనిక శాఖ అధీనంలో ఉన్నది.

గంగా, మహానంద నదుల సంగమ ప్రాంతంలో 1198వ సం॥ లో గౌర్ కోటను నిర్మించారు. ఇది బెంగాల్ ప్రాంతంలోని పురాతనమైన కోట. శిశుపాల్ ఘడ్, బారాబతి, నౌగాంగ్, బోడా, శ్యాంనగర్, సారంఘడ్ మొదలైనవి తూర్పు భారత దేశంలోని ముఖ్యమైన కోటలు. అదేవిధంగా దక్షిణ భారత దేశంలో బాదామీ, దిండుగల్, తిరుచిరా పల్లి, తెలిచేరీ మొదలైనవి చెప్పుకోదగిన కోటలు. పశ్చిమ భారతదేశంలో నాభా, హరిపర్వత్, కోట్ కాంగ్రా కోటలు;

1. కాలిబంగన్
2. ఢిల్లీ
3. అంబర్
4. భరత్‌పూర్
5. ఆగ్రా
6. గ్వాలియర్
7. రణథంభోర్
8. చిత్తోర్
9. కుంభల్‌ఘడ్
10. జోధ్‌పూర్
11. జైసాల్మేర్
12. బికనేర్
13. మాండూ
14. దౌలతాబాద్
15. అహ్మదనగర్
16. శివనేర్
17. సింఘ్‌ఘడ్
18. రాయ్‌ఘడ్
19. జంజీరా
20. సువర్ణదుర్గ్
21. రాజ్‌ఘడ్
22. బీదర్
23. గుల్బర్గా
24. బిజాపూర్
25. గోల్కొండ
26. వరంగల్లు
27. శ్రీరంగపట్నం
28. జింజీ
29. వేలూరు
30. మద్రాసు
31. విలియం కోట
32. రోహతాస్‌ఘడ్
33. అలహాబాద్
34. చునార్‌ఘడ్
35. కాలింజర్




మధ్యభారత దేశంలో ఝాన్సీ, చందేరీ, బర్హన్‌పూర్ కోటలు ఎంతో చరిత్రకలిగినవి.

మనదేశంలోని మొత్తం కోటల సంఖ్య 1400 కన్నా ఎక్కువే. మహారాష్ట్రలో 656 కోటలూ, మధ్యప్రదేశ్‌లో 330 కోటలూ, రాజస్థాన్‌లో 250 కోటలూ ఉన్నాయి. చాలా కోటలు శిథిలావస్థలో ఉన్నాయి. గోడలు కూలిపోయి, శిలలూ, విగ్రహాలూ దొంగిలించబడి, మెట్లు విరిగిపోయి, దారులు ఛిన్నాభిన్నమై హృదయవిదారకంగా కనిపిస్తున్నాయి. గత చరిత్రకు జ్ఞాపికలైన ఈ కోటలను పరిరక్షించుకోవలసిన బాధ్యత మనమీద ఉన్నది.



# నీ మీద ఒట్టు!

ఆలంబుడనే వాడికి అబద్ధాలు చెప్పటం బాగా అలవాటు. అందరూ వాడి మాటలు నమ్మడం మానేసేసరికి,ఒట్లు వేయడం ప్రారంభించాడు. ఆ ఊళ్ళో చాలామందికి ఒట్లు హానిచేస్తాయనే నమ్మకముంది.

ఒకరోజున ఆలంబుడు పొరుగింటికి వెళ్ళే సరికి,అవ్వ ఒకతె మనమడికి కథ చెబుతూ, "ఆరామనాథంఉత్త నేతిబీరకాయ!" అన్నది.

మనమడు నేతిబీరకాయ అంటే ఏమిటని అడిగాడు. నేతిబీరకాయలో నెయ్యి వుండనట్లే రామనాథంలో రాముడి లక్షణాలేం లేవని అవ్వ వివరించింది.

అప్పుడు ఆలంబుడు కలుగజేసుకుని, "అవ్వా! నిన్ననే మా ఇంట్లో నెయ్యి అయిపోయింది. నేను పెరట్లో నాలుగు నేతిబీరకాయలు కోసి తెచ్చిపిండిగిన్నెడునెయ్యి చేశాను. నువ్వేమో నేతిబీరకాయలో నెయ్యి లేదంటావేం?" అన్నాడు.

"నీ బుద్ధే అంత!అన్నీ అబద్ధాలు. లేకపోతే నేతిబీరకాయలో నెయ్యేమిటి?"అన్నది అవ్వ.

"లేదవ్వా — నీమీద ఒట్టు! నేను నిజం చెప్పాను," అని వెళ్ళిపోయాడు ఆలంబుడు.

ఆరాత్రిఅవ్వకుజ్వరంవచ్చింది.అవ్వపలవరిస్తూ, "ఆలంబుడు అబద్ధం చెప్పి నామీద ఒట్టు వేశాడు.అందుకే నాకీ జ్వరం," అన్నది.

మర్నాడు అవ్వ పెద్దకొడుకు రమణయ్య, ఆలంబుడింటికి వెళ్ళాడు. ఆలంబుడింట్లో లేడుకానీ, ఆ ఇంటి అరుగు మీద మరొక ముగ్గురుఆలంబుడికోసంఎదురుచూస్తున్నారు.

అందులో ఒకడి పేరు సోము. వాడు ఆలంబుడి ఈడువాడే. ఒకరోజున సోముతో తెల్లకాకులుండవని పందెం కట్టాడు. సోము వున్నాయన్నాడట. అలావుంటే, వాటిని తనే ముందు పట్టుకుంటానన్నాడు ఆలంబుడు. ఎవరు ముందు తెల్లకాకిని పట్టితెస్తే, వారికి రెండోవారు నూరు వరహాలివ్వాలని పందెం.

జొన్నలగడ్డ రామలక్ష్మి



సోముకు రెండు రోజులక్రితం పెరట్లో చెట్టుకింద కాకిపిల్ల ఒకటి కనిపించింది. దాన్ని చూసి వాడి తాత, "ఇది తెల్లగా వుంది. అంటే పుట్టుకలోపముంది. బహుశా ఎంతో కాలం బ్రతకదు," అన్నాడు.

"ఏమైతేనేం, ఇది నాకు వంద వరహాలు సంపాదించి పెడుతుంది," అంటూ సోము దాన్ని అరచేత వుంచుకుని, ఆలంబుడి వద్దకు వెళ్ళి విషయం చెప్పాడు.

ఆలంబుడు నవ్వి, "నీకంటే ముందే నేను తెల్లకాకుల్ని చూశాను. మన ఊళ్ళోవన్నీ తెల్లకాకులే. అన్నింటికీ నేనే నల్లరంగు వేశాను. ఇదొక్కటే నాకు దొరక్కుండా తప్పించుకుంది. దీనికీ రంగువేస్తా ఇలా ఇవ్వు," అన్నాడు.

సోము చిరాకుపడి, "ముందు నాకు వందవరహాలూ ఇవ్వు!" అన్నాడు.

దానికి ఆలంబుడు, "నీకంటే ముందు బోలెడు తెల్లకాకుల్ని చూసికూడా, నేను నిన్ను డబ్బుడిగానా?" అన్నాడు.

"అన్నీ అబద్ధాలు!" అన్నాడు సోము.

"అబద్ధాలు కాదురా, నీమీద ఒట్టు!" అన్నాడు ఆలంబుడు.

సోము తిట్టుకుంటూ వెళ్ళి, ఒకచోట ఊబిలో కూరుకుపోయాడు. ఎవరో చూసి సమయానికి రక్షించి వుండకపోతే, వాడికా రోజుతో భూమ్మీద నూకలు చెల్లేవే! తనమీద అబద్ధపు ఒట్టు వేసినందుకు సంజాయిషీ అడగడానికి వచ్చాడు వాడిప్పుడు.

అరుగుమీది రెండో మనిషి పేరు కాముడు. వాడు పేరింటమ్మ గుడిదగ్గర వుండే సీతను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాడు. ఆ విషయం ఆలంబుడికిచెబితే, "అరె! దానికి చట్టిముక్కు కదా, ఏం బాగుంటుంది?" అన్నాడు.

"చట్టిముక్కే నాకిష్టం", అన్నాడు కాముడు.

ఇది జరిగాక ఆలంబుడు, సీత వద్దకు వెళ్ళి, "నేను చెప్పానని చెప్పకు. కాముడు నీది చట్టిముక్కని అందరి దగ్గరా వేళాకోళం చేస్తున్నాడు. మీ నాన్న వద్ద బాగా డబ్బుంది కదా అనికానీ, లేకుంటే నువ్వంటే వాడికి ఇష్టంలేదు," అని చెప్పాడు.

సీతకు కోపం వచ్చి కాముడితో మాట్లాడటం మానేసింది. సీత తండ్రి ద్వారా విషయం

తెలిసి, కాముడు అలంబుడి వద్దకు వెళ్ళి, "నువ్వేదానికి విషం నూరిపోశావు.మళ్ళీ నువ్వే దానికి మంచి మాటలు చెప్పు," అన్నాడు.

ఇందుకు అలంబుడు, "నాకేం తెలియదు, నీమీద ఒట్టు!" అన్నాడు.

ఆ తర్వాత కాసేపటికి కాముడికి వడదెబ్బ తగిలి స్పృహ తప్పిపోయాడు.సీతవాడికి సప ర్యలు చేసింది. స్పృహ వచ్చాక సీతకు అసలు విషయం చెప్పాడు కాముడు. ఇద్దరి మధ్యా అపార్థాలుతొలగిపోయాయి.ఈరోజు కాముడు ఆలంబుణ్ణి సంజాయిషీ అడగాలని వచ్చాడు.

ఆ ఇంటిఅరుగు మీదున్న మూడో మనిషి గణపతి. ఆయనకు పెద్ద మామిడి తోట వుంది. ఆతోటలోంచి దొంగ ఒకడు దాదాపు వంద మామిడి కాయలు దొంగిలించడం, అలంబుడు చూశాడట.ఆదొంగపేరు దీపయ్య అని వాడు చెప్పాడు. ఈ దీపయ్య పేదరైతు, నిజాయితీపరుడు. కానీ గణపతి తోటలో కాయలుపోయాయి.దీపయ్యఇంట్లో వున్నాయి. అందుకని గణపతి, వాడినుంచి కాయలు లాక్కుని బాగా దేహశుద్ధి చేయించి పంపాడు.

ఈలోగా, గణపతి తోట కాపలావాడు భూషయ్య, దీపయ్య ఇంటికి వచ్చి, "యజ మాని చెబితే వందకాయలు కోశాను. మధ్యలో అనుకోని పని తగిలి అలంబుడికి చెబితే, కాయల్ని నీ ఇంట్లో వుంచమన్నాడు.ఆ సమ యంలో నీ ఇంట్లో ఎవరూ లేరు. తలుపులు తెరిచే వున్నాయి. కాయల్ని నీ ఇంట్లోపెట్టి,



అలంబుడితో ఈ సంగతి చెప్పమన్నాను. జరిగింది ఇదయితే, నువ్వు అనవసరంగా దెబ్బలు తిన్నావేమిటీ?" అన్నాడు బాధగా.

వెంటనే దీపయ్య, భూషయ్య గణపతి వద్దకు వెళ్ళారు.ఆయన ఆలంబుడికి కబురు పెట్టాడు. వాడు వచ్చి, గణపతితో, "నీకేం పాతపగలుండి దీపయ్యను కొట్టావో! నేను దీపయ్యదొంగఅని చెప్పలేదు. నీమీద ఒట్టు!" అన్నాడు.

ఆసాయంత్రం గణపతి, స్నానానికి వెళ్ళి, కాలవలో సుడిగుండంలో చిక్కుకుని చావు తప్పి కన్నులొట్టపోయి ఒడ్డుచేరాడు. ఇప్పుడు గణపతి, అలంబుణ్ణి అబద్ధపు ఒట్టువేసి నందుకు సంజాయిషీ అడగాలని వచ్చాడు.



రమణయ్యతో కలిసి మొత్తం నలుగురూ, అక్కడఆలంబుడి కోసం ఎదురుచూస్తున్నారు. ఎంతకూ ఆలంబుడి జాడలేదు.

అప్పుడురమణయ్యమిగతావాళ్ళతో,"వాడిక రాడు. మనంగ్రామాధికారికిఫిర్యాదు చేద్దాం," అన్నాడు.

సరేనని, నలుగురూ కలిసి గ్రామాధికారి వద్దకు వెళ్ళారు. ఆ సమయానికి అక్కడ ఆ దేశపురాజు, మంత్రితో సహా వచ్చివున్నాడు. గ్రామపరిపాలన ఎలా సాగుతున్నదీ, వాళ్ళు గ్రామాధికారినడిగి తెలుసుకుంటున్నారు.

ఇంతలో అక్కడికి రమణయ్య బృందం వచ్చి చేరారు. రాజువాళ్ళ గోడువిని, "వాడు అబద్ధాలాడతాడని తెలిసీ,వాడినెందుకు దగ్గరకు రానిస్తారు? వాడిమాటలెందుకు నమ్ముతారు?" అని ప్రశ్నించాడు.

దానికి గ్రామాధికారి వినయంగా, "ప్రభూ! ఇప్పుడా విషయం వద్దు. అవతలి మనిషిమీద అబద్ధపు ఒట్లువేయడం హత్యతో సమానం. అందుకుతగినశిక్షవాడికివిధించాలి,"అన్నాడు.

వెంటనే రాజభటులు బయల్దేరి వెళ్ళి ఆలంబుణ్ణి వెతికి పట్టుకుని తీసుకు వచ్చారు. రాజువాణ్ణి జరిగిందానికిసంజాయిషీఅడిగాడు.

ఆలంబుడు వెంటనే, "ప్రభూ! వీళ్ళందరూ నా మీద ఎందుకో పగబట్టారు. నా గురించి అన్నీ అబద్ధాలు చెబుతున్నారు.నాకేమీ తెలియదు. మీమీద ఒట్టు!" అన్నాడు.

అంతే! రాజుకుకడుపులోతిప్పినట్లయింది. ఆయన కోపంతో మండిపడుతూ, " వీడు దారుణమైన హంతకుడు! వీడిని క్షమించకూడదు. వెంటనే ఉరితీయండి," అన్నాడు.

మంత్రి కలగజేసుకుని, "ప్రభూ! వీడు హంతకుడన్న మీ అభిప్రాయంతో ఏకీభవించగలను,కానీ వీడిని ఉరితీయాలన్న నిర్ణయం మాత్రం తగదు," అన్నాడు.

"హంతకుడికిఉరిశిక్ష విధించడంతగదా? ఎందుకని?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

మంత్రి, రాజును అక్కణ్ణించి చాటుకు తీసుకువెళ్ళి, " ప్రభూ! రాజకీయం గురించి తమకు వేరే చెప్పాలా? ప్రస్తుతం పొరుగు రాజు మనమీద యుద్ధసన్నాహాలు చేస్తున్నట్లు చారులు వార్త తెచ్చారు. యుద్ధం జరిగితే

జయం మనదే!కానీ ఆలంబుడుండగా మనం సైన్యాన్ని శ్రమ పెట్టడమెందుకు? వాడి చేత పొరుగు దేశపు సైనికులందరిమీదా అబద్ధపు ఒట్లు వేయిద్దాం. అవసరం అయితే పొరుగు రాజుమీదే ఒట్టు వేయిద్దాం. ఇలాంటప్పుడు ఆలంబుణ్ణి ఉరితీయడం తగునా?" అన్నాడు.

దీనికి రాజు చిరాకుపడి, "మంత్రాలకు చింతకాయలు రాలతాయా? మూఢనమ్మకాలతో దేశాలను జయించగలిగితే, మనకు ఆయుధాలెందుకు? సైనికబలమెందుకు? బలపరాక్రమాలెందుకు?" అన్నాడు.

మంత్రినవ్వి, "ఒట్టుమూఢనమ్మకమనిమీరే అన్నారుకదా, ప్రభూ!ఆలంబుడికిఉరిశిక్షవిధించడం మూఢనమ్మకంతోనే కదా?" అన్నాడు.

అప్పుడు రాజు ఆశ్చర్యపడి, "అవును. నావివేకమేమైంది? అంత సులభంగా నేనెలా మూఢనమ్మకానికి గురయ్యాను?" అన్నాడు.

"మీరేకాదు, ప్రభూ! మనుషులందరూ ఇంతే! ఎదుటి మనిషిని తప్పుపట్టడానికే చాలామంది మూఢనమ్మకాలను ఆశ్రయిస్తారు.ఆలంబుడుఅబద్ధంచెప్పాడని ఉక్రోషం. ఆతర్వాత కాకతాళీయంగా ఏదో జరిగితే అది అందువల్లనే అనిపిస్తుంది. అలాంటివి నలుగురి నుంచివింటే, అనుమానం బలపడుతుంది.అందువల్లనేమీరు,ఆలంబుడుమీమీద ఒట్టుఅనగానే కాస్తకలతచెందారు.మూఢనమ్మకాలను న్యాయవిచారణకు తేవడమే తప్పు. అబద్ధాలు చెప్పడం సాంఘిక సమస్య. అది గ్రామస్థులే సర్దుబాటు చేసుకుంటారు.తమరు ఆలంబుణ్ణివిడిచిపెట్టండి," అన్నాడుమంత్రి.

రాజు సరేనని,అక్కడ చేరిన వారందరికీ మంత్రి అభిప్రాయం చెప్పి, ఆలంబుడితో, "ఒరేయ్! నిన్ను విడిచిపెడుతున్నాను కదా అని రెచ్చిపోయివిచ్చల విడిగాఅబద్ధపు ఒట్లు వేయకు. బుద్ధిగా వుండు," అన్నాడు.

ఆలంబుడు,రాజుపాదాలకు మ్రొక్కి, "మీ మీద ఒట్టు, ప్రభూ! ఇకమీదట మీరు చెప్పినట్లే నడుచుకుంటాను," అని వెళ్ళిపోయాడు.

రాజుకు మూఢనమ్మకం పోయిందో,ఆలంబుడిది అబద్ధపు ఒట్టుకాదోకానీ -- వాడా ఒట్టు వేసినా అప్పుడూ, ఆ తర్వాత కూడా ఆయనకేమీ హాని కలగలేదు.





# అనుభవజ్ఞుడి అవసరం

పట్నంలోని రాజవీధిలో ముకుందయ్య, గోవిందయ్య అనే ఇద్దరు భాగస్థులుగా, ఒక చెప్పుల దుకాణం ప్రారంభించారు.

దుకాణం ప్రారంభమైన మర్నాడు ముకుందయ్య, గోవిందయ్యతో, "దుకాణంలో మన దగ్గర పనిచేయడానికి కుర్రవాడు అవసరం కదా! అందుకని, నేనెరిగిన కిష్టయ్య అనే కుర్రవాణ్ణి రేపటి నుంచి పనికి రమ్మని చెప్పాను. వాడికి రెండు వందలు జీతంగా ఇస్తామని కూడా చెప్పాను," అన్నాడు.

దానికి గోవిందయ్య తలాడించి, "అలాగా! నువ్వు చేసినపనే నేనూ చేశాను.ప్రకాశం అనే కుర్రాడిని పనికి రమ్మని చెప్పాను. వాడికి మంచి తెలివితేటలతో పాటు, మన దుకాణం లాంటిదుకాణాల్లో లోగడ పనిచేసిన కొంత అనుభవం కూడా వుంది.అందుకనివాడికి నెలకు మూడు వందలు జీతం ఇస్తానని చెప్పాను," అన్నాడు.

"మొత్తం మీద ఒకళ్ళకు తెలియకుండా ఒకళ్ళం, పనికుర్రాళ్ళను మాట్లాడేశాం," అని, ముకుందయ్య కొంచెం ఆగి, "తక్కువ జీతానికి వచ్చే కిష్టయ్యనే పనిలోకి తీసుకుందాం. ఈ కిష్టయ్య అనేవాడికి లోగడ అనుభవం లేకపోయినా, చెప్పినది చప్పున గ్రహించి ఆ పని చేయగలడు. మన దుకాణానికి వచ్చిన బేరగాళ్ళకు, అడిగిన చెప్పులు వాళ్ళ కాళ్ళ దగ్గర పెట్టడానికీ, వాళ్ళు కొనదలచిన వాటిని పదిలంగా పొట్లం కట్టిఇవ్వడానికీపెద్ద తెలివి తేటలూ, అనుభవమూ కావాలనుకోను! రేపు ఆ ప్రకాశం అనేవాడు దుకాణానికి వచ్చినప్పుడు, నేను వాడికి ఏదో సర్దిచెప్పి పంపేస్తానులే, నువ్వేమీ విచారించకు," అన్నాడు.

"వంద రూపాయల తేడా గురించి కాదు. ఇద్దరినీ పనిలోకి తీసుకుని, ఒక నెలరోజుల పాటు పరీక్షించి,పనికొచ్చేవాణ్ణి వుంచి రెండో వాణ్ణి పంపేద్దాం!" అన్నాడు గోవిందయ్య.

వారణాశి శ్రీరామకృష్ణ

ఇందుకు ముకుందయ్య, సరే అని తల వూపాడు. మర్నాడు కిష్టయ్య, ప్రకాశం ఇద్దరూ పనిలోకి వచ్చారు.

వారం రోజుల తర్వాత ఒకనాడు, శ్రీమంతుడైన పెద్దమనిషి ఒకాయన దుకాణానికి వచ్చి, మంచిఖరీదైన చెప్పులనుతీసుకున్నాడు. వాటి ధరఅరవైరూపాయలు.తీరాఆయనడబ్బు ఇవ్వబోయేసరికిఇరవైరూపాయలుతక్కువయినై.

శ్రీమంతుడుహుందాగా,ముకుందయ్యతో, "సమయానికి చాలినంత డబ్బు జేబులో లేదు. చెప్పులను పొట్లం కట్టించి, దుకాణం పక్కన వున్న నా గుర్రబ్బండిలో పెట్టించండి. ఇంటికి వెళ్ళగానే, మిగతా ఇరవై రూపాయలు పనివాడితో పంపుతాను," అన్నాడు.

ఇది విని ముకుందయ్య సంశయంలో పడ్డాడు. ఈవచ్చిన పెద్దమనిషి ఎవరో అతడికి తెలియదు. ఇరవై రూపాయలు అరువుఇస్తే, ఆడబ్బు తిరిగి అందుతుందో లేదో? కాదంటే ఆయనతనకుఅవమానంజరిగినట్టేభావిస్తాడు!

యజమాని సంశయిస్తున్న సంగతి గ్రహించిన ప్రకాశం, ఆయన సంశయించనవసరం లేదన్నట్టు సైగ చేశాడు. దానితో ముకుందయ్య శాంతపడి,సంపన్నుడితో, "అయ్యా, ఈ ఇరవై రూపాయలవిషయంపట్టించుకోకండి.చెప్పుల్ని తీసుకువెళ్ళండి," అన్నాడు.

ఇంతలో ప్రకాశం, ఆయనతో, "తమరు వెళ్ళి బండిలో కూర్చోండి.నేనీచెప్పుల్ని పొట్లం కట్టి తెచ్చి బండిలో పెడతాను," అన్నాడు.



తర్వాత ప్రకాశం చెప్పుల పొట్లం తీసుకుపోయి బండిలో పెట్టివచ్చాడు. అప్పుడు ముకుందయ్య, వాడిని, "ఎవరా పెద్దమనిషి? ఆయన నీకెలా తెలుసు?" అని అడిగాడు.

"ఆయన గురించి మీకెంత తెలుసో, నాకూ అంతే తెలుసు!" అన్నాడు ప్రకాశం.

ఇది వింటూనే ముకుందయ్య అగ్గిమీద గుగ్గిలంలా అయిపోయి,"ఆయనెవరో ఏమిటో తెలియకుండానే హామీగా నిలబడ్డావన్నమాట? నిన్ను నమ్మి ఆయనకు అరువు పెట్టాను. ఆ సొమ్ము వసూలు కాకపోతే, దాని కింద నీ జీతం మొత్తం మినహాయించుకుంటాను. ఆ తర్వాత నిన్ను దుకాణంలోంచి ఇంటికి పంపేస్తాను," అంటూ కేకలు వేశాడు.

ఏదో పని మీద బయటికిపోయి, అప్పుడే దుకాణానికి తిరిగి వచ్చిన గోవిందయ్య, ముకుందయ్య వేస్తున్న కేకలకు కారణం తెలుసుకుని, ప్రకాశాన్ని "ఆ పెద్దమనిషి ఎవరో కూడా తెలియకుండా ఎందుకు హామీగా నిలబడ్డావు? అసలు ఇక్కడ పనికి కుదరడంలో, నీ ఎత్తుగడ ఏమిటి?" అంటూ కోపంగా ప్రశ్నించాడు.

అందుకు ప్రకాశం వినయంగా, "అయ్యా! ఆయన మనకివ్వవలసిన ఇరవై రూపాయలకూ, ఆయన తీసుకుపోయిన చెప్పుల జతే హామీ! నేనాయనకిచ్చిన రెండు చెప్పులూ ఒకే కాలువి. ఆయనకు మన బాకీ తీర్చే ఉద్దేశం వున్నా లేకపోయినా, చెప్పులు మార్చుకోవడానికి తిరిగి రాక తప్పదు. అప్పుడు మనకివ్వవలసిన ఇరవై రూపాయలూ ఇవ్వకా తప్పదు," అన్నాడు.

ఆ సాయంత్రం ప్రకాశం చెప్పినట్లే జరిగింది. శ్రీమంతుడు, దుకాణం ముందు బండిదిగి హడావిడిగా దుకాణంలోకి వచ్చి, ముకుందయ్య, గోవిందయ్యలతో, "మీ పనివాడు అమాయకుడో, లేకఇలాంటి దుకాణాల్లో పనిచేయడానికి కొత్తవాడో తెలియడం లేదు. రెండూ ఒకే కాలి చెప్పులు బండిలో తెచ్చిపెట్టాడు," అన్నాడు విసుగుపడుతూ.

ఆ వెంటనే ముకుందయ్య, "క్షమించాలి, పొరబాటు జరిగిపోయింది!" అని శ్రీమంతుడికి క్షమాపణ చెప్పుకుని, ప్రకాశంతో, "ఏరా, ప్రకాశం! నీకు ఆ పాత పళ్ళదుకాణం అలవాట్లు పోలేదన్నమాట. అక్కడ కొనేవాళ్ళకు చిన్నా, పెద్ద అంటూ తేడా లేకుండా ఒకే ప్రమాణంలో వున్న పళ్ళు బుట్టలో వేస్తున్నట్టే, ఇక్కడ ఒకే మోస్తరుగా వుండే చెప్పులు పొట్లం కడుతున్నావన్నమాట!" అన్నాడు కోపంగా.

ఈమాటలకు శ్రీమంతుడు నవ్వుకుని, ముకుందయ్య ఇచ్చిన చెప్పులు తీసుకుని, బాకీ డబ్బు ఇచ్చి వెళ్ళిపోయాడు. తర్వాత ముకుందయ్య, ప్రకాశం తెలివితేటల్ని మెచ్చుకుని, గోవిందయ్యతో, "చేయవలసిన పని ఏదైనా అనుభవజ్ఞుడి వల్ల ఎలాంటి ప్రయోజనం వుంటుందో, ఇప్పుడు నాకర్థమైంది. ప్రకాశాన్నే పనికి వుంచేసుకుందాం!" అన్నాడు.






విశ్వకర్మ నిర్మించిన ఇంద్రప్రస్థ నగరాన్ని రాజధానిగా పెట్టుకుని పాండవులు తమ అర్ధరాజ్యాన్ని ధర్మంగా పాలించ నారంభించారు. రాజ్యం నానాటికీ అభివృద్ధి చెందుతూ వచ్చింది.

ఈ సమయంలో ఆకస్మికంగా నారదముని ధర్మరాజును చూసి పోదామని వచ్చాడు. ధర్మరాజు తన తమ్ములతోసహా ఎదురువెళ్ళి, నారదుణ్ణి తీసుకువచ్చి, సుఖాసనమూ, అర్ఘ్య పాద్యాలూ ఇచ్చి, సాష్టాంగ నమస్కారం చేశాడు. అంతఃపురంలో నుంచి ద్రౌపది కూడా వచ్చి నారదుడికి నమస్కారం చేస్తూ నిలబడింది. నారదుడు ఆమెను ఆశీర్వదించి పంపేసి, భీమార్జున నకుల సహదేవులు వింటూండగా ధర్మరాజుతో, "మీ అయిదు గురికీ ఒక్కతె భార్యగా ఉంటున్నది. ఆమె కారణంగా మీలో మీకు విరోధం కలగకుండానూ, మీ మధ్య సౌహార్దం పెరిగేటట్టూ ఉండాలంటే మీరుకొన్ని నియమాలు పెట్టుకోవాలి. ఇలాటి విషయాలలో ఎంత సన్నిహితులకు కూడా వైరం రావటం సహజం," అంటూ సుందోపసుందుల కథ చెప్పాడు:

హిరణ్యకశిపుడి వంశంలో నికుంభుడనే వాడు పుట్టాడు. అతని కొడుకులే సుందోపసుందులు. వాళ్ళు ఒకరినొకరు క్షణం కూడా విడిచిపెట్టక, ఎప్పుడూ కలిసి తిరుగుతూ, ఎంతో అన్యోన్యంగా ఉండేవారు. వాళ్ళకు మూడు లోకాలూ జయించాలన్న కోరిక కలిగింది. అందుకోసం తపశ్శక్తి సంపాదించుకోగోరి వాళ్ళు వింధ్య ప్రాంతంలో ఒక నిర్జనా

17. అర్జునుడి తీర్థయాత్రలు

రణ్యం చేరి, అక్కడ ఘోరమైన తపస్సు ప్రారంభించారు. ఆ వేడికి వింధ్యగుహల యందు అగ్ని పుట్టి, అరణ్యమంతటా గొప్ప జ్వాలలూ, పొగలూ లేచాయి.

వాళ్ళ తపస్సు చూసి దేవతలు భయపడి, తపోభంగం కలిగించాలని ఆ సుందోపసుందుల ఎదట రత్నాలరాసులూ, స్త్రీలూ ఉన్నట్టు భ్రమకలిగించారు.దానికిసుందోపసుందులు చలించలేదు. తరవాత దేవతలు మరొక భ్రమ కలిగించారు. దాని ఫలితంగా సుందోపసుందుల ఎదట వారి తల్లులనూ, భార్యలనూ, కొడుకులనూ ఎవరో రాక్షసులు పీడిస్తున్నట్టూ, వాళ్ళు రక్షించమని సుందోపసుందులను అడుగుతున్నట్టూ కనపడింది. దానికి కూడా సుందోపసుందులు చలించలేదు. అప్పుడు వారి ఎదుట బ్రహ్మ ప్రత్యక్షమై వారికి అన్ని రకాల మాయలూ, అస్త్రాలూ, సాటిలేని బల పరాక్రమాలూ, మూడు లోకాలనూ జయించే శక్తీ వరాలుగా ఇచ్చాడు. వాళ్ళు అమరత్వం కూడా అడిగారుగాని బ్రహ్మ అందుకు సమ్మతించక, వారికి ఇతరు లెవ్వరిచేతా చావు లేకుండా వరమిచ్చాడు. తాము ఒకరినొకరు చంపుకోవటమనేది వాళ్ళకు తట్టనేతట్టదు గనకతమకు అమరత్వం లభించినట్టే వాళ్ళు భావించారు.

ఇలా వరం పొందిన సుందోపసుందులు సైన్యాలను సమకూర్చుకుని, ఇంద్రలోకానికి పోయి, దాన్ని జయించి, పాతాళానికి వెళ్ళి, దాన్ని కూడా జయించి, చివరకు భూలోకాన్ని బీభత్సం చేయసాగారు.అప్పుడు బ్రహ్మ విశ్వ



కర్మను పిలిచి, అతనిచేత తిలోత్తమ అనే త్రిలోకసౌందర్యవతినిసృష్టించి,సుందోపసుం దులుండే చోటికి పంపాడు. ఆమె ఒక నది ఒడ్డున పూలు కోసుకుంటూండగా చూసి, ఆమెను మోహించి సుందోపసుందులిద్దరూ ఆమె చేతులు రెండూ పట్టుకుని, ఆమెను తమభార్యనుచేసుకునేటందుకునిశ్చయించు కున్నారు. "మాలో నువ్వు ఎవరికి భార్యవవు తావు?" అని వాళ్ళు అడిగితే, "మీ ఇద్దరిలో ఎక్కువ బలాఢ్యుడికి భార్యనవుతాను," అన్నది తిలోత్తమ. ఎవరు ఎక్కువ బలంగలవారో తేల్చుకోవటానికై వారిద్దరూగదాయుద్ధం చేసి, ఒకరినొకరు చంపేసుకున్నారు.



నారదుడు పాండవులకు ఈ సుందోపసుం దుల వృత్తాంతం చెప్పి, "మీలో అలాటి వైరం రాకుండా ఏదో ఒక నియమం పెట్టు కోండి. ఇదంతా మీ మంచికే చెబుతున్నాను," అన్నాడు.

అప్పుడు పాండవులు నారదుడు సాక్షిగా ఒక నియమం ఏర్పాటు చేసుకున్నారు. దాని ప్రకారం ద్రౌపది ఒక్కొక్క సంవత్సరం ఒక్కొక్క భర్త దగ్గిర ఉంటుంది. ఆమె ఎవ రింట ఉంటున్నదో ఆ ఇంటికి మిగిలిన వారెవ్వరూ పోరాదు; ఒకవేళ ఎవరైనా వెళ్ళటం జరిగితే వాళ్ళు పన్నెండు నెలలపాటు బ్రహ్మ చర్యంతో వనవాసం జరిపి, తీర్థయాత్రలు చెయ్యాలి. వారు చేసుకున్న ఈ నియమానికి నారదుడు సంతోషించి, "ఇలాటి ఏర్పాటు ఉన్నట్టయితే మీ మధ్య ఎవరూ విభేదాలు పెట్టలేరు.మీరు సుఖపడతారు,"అని చెప్పి, వెళ్ళి పోయాడు.

ద్రౌపది నియమం ప్రకారం ఏడాదికి ఒక భర్త ఇంట ఉంటున్నది. కాలం గడిచిపోతు న్నది.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు ధర్మరాజు ఇంటి వెలుపల నిలబడి ఆక్రందనం చెయ్యటం అర్జునుడు చూసి, "అయ్యా, ఎందుకు ఏడుస్తున్నావు?" అని అడిగాడు.

"నాయనా, మీ వంటి ధర్మాత్ముల రక్షణలో ఉంటున్నా కూడా నా హోమధేనువులు దొంగలు తోలుకుపోయినారు. ఎంత ఘోషిం చినా నా ఏడుపు వినిపించుకునే వారు కన



పడటం లేదు. ఆవులు పోవటంతో నా ధర్మ కర్మలు నిలిచిపోయాయి. దయచేసి వాటిని నాకిప్పించు," అన్నాడు బ్రాహ్మణుడు దీనంగా.

"నీఆవులను నీకిప్పిస్తాను, ఇక్కడే వుండు. దొంగలు ఎటు వెళ్లారో చూపటానికి నావెంట వత్తువుగాని," అంటూ అర్జునుడు ధనుర్బాణాలు తీసుకురావటానికి ధర్మరాజు ఇంట్లో ప్రవేశించాడు.

కానిఅంతలోనేఅర్జునుడికితమనియమం గుర్తు వచ్చింది. ద్రౌపది ధర్మరాజుకు భార్యగా ఉంటున్నది. అలాంటప్పుడు తానువారి ఇంట ప్రవేశిస్తే నియమభంగ మవుతుంది. నియమ భంగమవుతుందని విల్లుబాణాలు తెచ్చుకోవ డంలో ఆలస్యం చేస్తే కార్యభంగం అవుతుంది. నియమభంగమైతే శిక్ష అనుభవించ వచ్చు గాని కార్యభంగం కానివ్వరాదనుకుని అర్జునుడు, ధర్మరాజూ ద్రౌపదీ ఏకాంతంగా ఉన్న మందిరం ప్రవేశించి, ధర్మరాజు అనుమతితో ధనుర్బాణాలు తీసుకుని, బ్రాహ్మణుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళి, దొంగలతో పోరాడి జయించి, వారు ఎత్తుకుపోయిన గోవులను బ్రాహ్మణుడికి తిరిగి ఇప్పించాడు.

అర్జునుడు ఇంటికి తిరిగి వచ్చి పెద్దల ప్రశంసలందుకుని, వారికి నమస్కారాలు చేసి, ధర్మరాజు వద్దకు వెళ్ళి, "నియమాన్ని ఉల్లంఘించి, నువ్వూ, ద్రౌపదీ ఉన్న మందిరం ప్రవేశించాను గనక ఒక ఏడాది పాటు వనవాసమూ, తీర్థయాత్రలూ చేస్తాను, అనుమతి ఇయ్యి," అన్నాడు.

ఈ మాటలకు ధర్మరాజు నొచ్చుకుని, "అర్జునా, పెద్దవాళ్ళు భార్యలతో ఏకాంతంగా ఉన్న చోటికి చిన్నవాళ్ళు రావటం తప్పుకాదు. అంతేకాక, ఆ బ్రాహ్మణుడి అవసరం కొద్దీ నువ్వు రావటం జరిగింది. అందువల్ల మేలే జరిగింది గనక, అది ఏమాత్రం తప్పు పని కాదు. నా మాట అంటే నీకు లక్ష్యం ఉన్నట్టయితే ఈ తీర్థయాత్ర ఆలోచన మానుకో," అన్నాడు.

ఆ మాటకు అర్జునుడు, "ఒకరు తప్పు చేస్తే మనం శిక్షిస్తాం. అలాటి మనమే తప్పు చేసి, ఏదో సాకు చెప్పి శిక్ష తప్పించుకోవటం తగని పని. నన్ను ఆపవద్దు, నేను తీర్థయాత్రకు

బయలుదేరటానికే నిర్ణయించుకున్నాను," అన్నాడు.

ధర్మరాజు సరేననక తప్పలేదు. అర్జునుడు అరణ్యవాసానికి తగిన విధంగా జుట్టూ, కట్టూ అమర్చుకుని అరణ్యానికి బయలుదేరాడు. అతనితోబాటు అనేకమంది బ్రాహ్మణులూ, పుణ్యకథలను చెప్పే పౌరాణికులూ బయలుదేరారు. వారందరితోనూ కలిసి అర్జునుడు అనేక తీర్థాలు సేవించి, కొంత కాలానికి గంగాద్వారం చేరాడు.

అక్కడ అనేకమంది మునులు గంగలో స్నానాలు చేసి, అగ్నిని అర్చించి, అందులో ఆహుతులు వేస్తున్నారు. అది చూసి అర్జునుడు చాలా ఆనందంపొంది, తాను కూడా స్నానం చేసి, దేవతర్పణాలూ, పితృతర్పణాలూ అగ్నిలో వేల్చుదామనుకుని స్నానం చెయ్యటానికి నదిలో దిగాడు.

ఆ సమయంలో ఉలూపి అనే నాగకన్య అర్జునుడి అందం చూసిఆకర్షించబడి, నీటిలోనే అతన్ని పట్టుకుని, నీటిలోకి లాగి నాగలోకానికి తీసుకుపోయి, ఒక దివ్యమైన భవనం చేర్చింది.

అర్జును డామెను చూసి ఆశ్చర్యంతో, "ఏమిటి నీ సాహసం? అయినా నువ్వు ఎవతెవు? ఎవరి కూతురివి? ఇది ఏ దేశం?" అని అడిగాడు.

"నాథా,నేను నాగులలో ఐరావత కులానికి చెందిన కౌరవ్యుడు అనే నాగరాజు కుమార్తెను.



నా పేరు ఉలూపి. మన్మధుడి లాటి నిన్ను చూసి అభిమానించి, మా నాగులకుండే శక్తుల ప్రభావంతో నిన్ను ఇక్కడికి తెచ్చాను. నా కోరిక తీర్చిసంతానం పొందు," అన్నది ఉలూపి.

"చూడు, ఉలూపీ, కారణాంతరం వల్ల నేను బ్రహ్మచర్యం అవలంబించి తీర్థయాత్రలతో కాలక్షేపం చేస్తున్నాను. నన్ను వ్రతభంగం చెయ్యమని నువ్వు అడగటం అధర్మం. నీ మాట ఎలా ఉన్నా నాకు దాని మూలంగా మహాపాపం చుట్టుకుంటుంది," అన్నాడు అర్జునుడు.

కాని ఉలూపి ఆ మాటకు ఒప్పుకోక, "ద్రౌపది విషయంలో మీ అన్నదమ్ములు

చేసుకున్న నియమం మాట తెలియకపోలేదు. అయినా, నువ్వు బ్రహ్మచర్య వ్రతమని చెప్పి లాభం లేదు. నువ్వు నా కోరిక ఈడేర్చకపోతే బాధతో నేను మాడి చచ్చిపోతాను. ఆ పాపం నీకు చుట్టుకుంటుంది. ప్రాణం కాపాడటం కన్న గొప్ప పుణ్యం ఉండదు. నాకు అభయం ఇయ్యి," అంటూ అర్జునుడి పాదాలు గట్టిగా పట్టుకున్నది.

అర్జునుడు పరిస్థితి బాగా ఆలోచించి, ఉలూపి కోరిక తీర్చ నిశ్చయించుకున్నాడు. అతనా రాత్రి ఆమెతో గడిపాడు. మర్నాడు ఉదయం ఉలూపి అతనికి దారి చూపుతూ వెంట వచ్చి, గంగాద్వారానికి చేర్చింది. ఆమె అర్జునుడికి ఏ జలప్రాణి నుంచీ ప్రమాదం లేకుండా వరమిచ్చి తన నివాసానికి తిరిగిపో యింది. ఆమె అర్జునుడివల్ల గర్భవతి అయి, కొంత కాలానికి ఇరావంతుడనే కొడుకును కన్నది.

గంగాద్వారం వదలి అర్జునుడు అనేక తీర్థాలు సేవిస్తూ,అనేక నదులస్నానాలు చేస్తూ, బయలుదేరిన పదమూడవ నెలలో మణిపుర మనే నగరం చేరాడు. ఆ నగరానికి రాజు చిత్రవాహనుడు. ఆయనకు చిత్రాంగద అనే అందమైన కుమార్తె ఉన్నది. ఆమెను చూడ గానే అర్జునుడికి ఆమెపై అభిమానం కలిగింది. అతను చిత్రాంగదను తన కిచ్చి వివాహం చెయ్యమని ఆమె తండ్రి చిత్రవాహనుణ్ణి నడిగాడు.

దానికి చిత్రవాహనుడు,"అంత కన్న నాకు కావలసినదేమిటి? కాని ఒక్క విషయం చెప్పాలి. మా వంశంలో ప్రతి తరానికి ఒక్కడే కొడుకు. అయితే నాకు మాత్రం కూతురు కలిగింది. అందుచేత ఈమెకు కలిగే కొడు కును నేను నా కొడుకుగా పెంచుకుంటాను. దానికభ్యంతరం లేకపోతే నీ ఇష్టప్రకారం ఇప్పుడే నా కుమార్తెను నీకిచ్చి వివాహం చేస్తాను," అన్నాడు.

అర్జునుడు అందుకు సమ్మతించి, చిత్రాం గదను పెళ్ళాడాడు. ఆమెతో మూడు నిద్రలు చేసి, తన వెంట ఉన్న బ్రాహ్మణబృందంతో బయలుదేరి దక్షిణ సముద్రతీరానికి చేరుకు న్నాడు.



# చందమామ కబుర్లు

## అరుదైన విషయం!

ఒకే కాన్పులో ఇద్దరు కవల పిల్లలు పుట్టడం సాధారణమైన విషయమే. 82 కాన్పులలో ఒకటి ఇలా వుంటుందని చెబుతారు. అదే విధంగా 6,400 కాన్పులలో ఒకటి ముగ్గురు ఒకేసారి పుట్టడం జరగవచ్చు. నలుగురు ఒకేసారి పుట్టడం



512,000 కాన్పులలో ఒకటి జరుగుతుంది. ఒకే కాన్పులో ఐదుగురు పుట్టడం 41,000,000 కాన్పులకు ఒకసారి జరుగుతుంది. గత జూన్ నెలలో ఈజిప్టుకు చెందిన ఒక స్త్రీ ఒకే కాన్పులో ఆరుగురు పిల్లల్ని కన్నది. ఇది చాలా అరుదుగా, అంటే 3,300,000,000 కాన్పులకు ఒకటి జరుగుతుంది. నలుగురు మగపిల్లలూ - ఇద్దరు ఆడ పిల్లలూ పుట్టినప్పుడు 860 గ్రా॥ నుంచి 1.75 కి.గ్రా. బరువు ఉన్నారు. శస్త్రచికిత్స ద్వారా ఈ పిల్లలను వెలుపలికి తీసిన డాక్టర్లు, మిగతా వాళ్ళతోపాటు ఈ పిల్లలు బతికి పెరిగి పెద్దవాళ్ళు కావాలని కాంక్షిస్తున్నారు!

## ఎవరు ఎవరు?

కేరళకు చెందిన ఆర్.ఎస్. పిళ్లై, వల్సలా దంపతులకు నాలుగేళ్ళ క్రితం ఒకేసారి ముగ్గురు పిల్లలు పుట్టారు. నీనా, నీతు, నిమ్మి అనే ఆ అక్కచెల్లెళ్ళను ఇటీవల బడిలో చేర్పించారు. ఎత్తులో, రూపురేఖలలో, రంగులో ఒకేవిధంగా వుండడం వల్ల ఆ పిల్లలలో ఎవరు ఎవరని పోల్చుకోలేక ఉపాధ్యాయులు కొన్ని వారాలు సతమతమయ్యారు. ఆఖరికి వాళ్ళ ప్రవర్తనలో వున్న కొద్దిపాటి తేడాను బట్టి గుర్తించడం మొదలుపెట్టారు. ఆ పిల్లల అసలు పేర్లను వదిలి ఇంట్లో ముద్దుగా మాలు, మీను, మోలు అని పిలుస్తారు. పేర్లు బాగానే ఉన్నాయిగాని, ఎవరి పేరు ఏది అన్నదే ఎదుటివాళ్ళ సమస్య!

## అందరూ న్యాయవాదులే!

ఒకే కుటుంబానికి చెందిన నలుగురు అన్నదమ్ములు, ఒక చెల్లె న్యాయవాద వృత్తిని చేపట్టారు. కేరళ రాష్ట్రానికి చెందిన వేలు (80) జానకి (70) దంపతులకు రామచంద్రన్, రామనాథన్, రామభద్రన్, రామరాజన్, రమాదేవి అని ఐదుగురు సంతానం. పెద్ద కొడుకు రామచంద్రన్ 1971వ సం॥లో న్యాయవాద పట్టభద్రుడయ్యాడు. ఇప్పుడతని వయసు 45 సం॥లు. ఆయన తిరుచూర్‌లో న్యాయవాదిగా ఉంటున్నాడు. రామభద్రన్ కూడా అక్కడే న్యాయవాది. రామనాథన్ కున్నంకొళంలోనూ, రామరాజన్ పారావూర్‌లోనూ న్యాయవాద వృత్తిని ప్రాక్టీస్ చేస్తున్నారు. రమాదేవి మహారాష్ట్రలోని నాశిక్‌లో ఉంటున్నది. ఆమె భర్త అశోకన్ కూడా లాయరే. రామభద్రన్ భార్య షీలా కూడా త్వరలో లాయర్ కానున్నది. అయినా, వృద్ధదంపతులు మాత్రం ఇంతవరకు కోర్టుకువెళ్ళేపరిస్థితిమాకురాలేదుఅదేచాలు — అంటున్నారు సంతోషంగా.

# గంగరావి

బ్రిటిష్ నావికుడు కేప్టన్ కుక్ 1769వ సం॥లో పసిఫిక్ మహాసముద్రంలోని టాహిటీ దీవిని చేరినప్పుడు అక్కడి ఆలయాల సమీపంలో ఆకర్షణీయమైన పూలతో కొన్ని చెట్లు కనిపించాయి. ఆయన వాటికి 'థెస్పీసియా' అని పేరు పెట్టాడు. గ్రీకు భాషలో థెస్పీసియా అంటే 'దివ్యమైన' అని అర్థం. మన దేశంలో ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో ఈ చెట్లు అక్కడక్కడ కనిపిస్తాయి. ఈ చెట్లను ఆంగ్లంలో పోర్షియా చెట్లు, టులీప్ చెట్లు అని పిలుస్తారు. వీటి కొమ్మలు గుబురుగా చూడడానికి గొడుగులా ఉండడం వల్ల 'అంబ్రెల్లా ట్రీస్' అని కూడా అంటారు. ఈ గంగరావి చెట్లను తమిళంలో పూ అరసు అనీ, కన్నడంలో అరసి అనీ, మలయాళంలో చందామర అనీ అంటారు. హిందీ, మరాఠీ, గుజరాతీ భాషలలో భేండీ అని అంటారు. బెంగాలీ, పంజాబీ భాషలలో పరాష్ అని అంటారు.

వృక్షశాస్త్రంలో దీనిని 'థెస్పీసియాపపాల్నీ' అని అంటారు. దీని ఆకులు మందంగా, మెత్తగా గుండె ఆకారంలో కొనలు మొనదేలి వుంటాయి. ఆకులు రాలినా చెట్లు మాత్రం ఎప్పుడూ పచ్చగానే కనిపిస్తాయి.

పువ్వులు పసుపుపచ్చ రంగులో కాంతివంతంగా ఉంటాయి. లోపలి భాగాలు ఎర్రగా ఉంటాయి. అవి క్రమేణా ముదురు ఎరుపు రంగుకు మారతాయి. కాయలు పచ్చగానూ, గుండ్రంగానూ ఉంటాయి. ముదిరి పండేప్పుడు నలుపు రంగుకు మారతాయి. చెట్లు ఏడాది పొడవునా పూచినప్పటికీ, శీతాకాలంలో పూత ఎక్కువగా కనిపిస్తుంది.

దీని కలప చాలా దృఢమైనది. నీళ్ళకు తట్టుకునే స్వభావం కలది గనక పడవలూ, ఓడరేవులలోని సామగ్రి తయారీకి దీనిని ఉపయోగిస్తారు. బండిచక్రాలు, పెట్టెలు మొదలైన వాటిని చేయడానికి కూడా ఈ కలపను ఉపయోగిస్తారు. గంగరావి ఆకులూ, పువ్వులూ, కాయలూ, పళ్ళూ, వేళ్ళూ, బెరడూ అన్నిటికీ కొన్ని ఔషధగుణాలు ఉన్నాయి.



మనదేశపు ఋషులు - 8

# చ్యవనుడు

భృగుమహర్షి భార్య పులోమ ఆశ్రమంలో ఒంటరిగా ఉన్నప్పుడు ఒక రాక్షసుడు ఆమెను అపహరించడానికి వచ్చాడు. గర్భిణిగా వున్న ఆమె కడుపు నుంచి మగబిడ్డ ఆగ్రహంతో బయటకు దూకి రాక్షసుడితో యుద్ధానికి తలపడ్డాడు. రాక్షసుడు భయపడి పారిపోయాడు. నెలలు నిండకముందే పుట్టిన ఆ బిడ్డకు చ్యవనుడని పేరు పెట్టారు.

చ్యవనుడు పెరిగి పెద్దవాడై, నర్మదా నదీ తీరంలో కూర్చుని ధ్యాన నిమగ్నుడైపోయాడు. అతని చుట్టూ పుట్టలు పెరిగాయి. ఎప్పుడో కళ్ళు తెరవడం తప్ప అతనిలో చలనం కూడా సన్నగిల్లింది!

ఒకనాడు శర్యాతిరాజు తన పరివారంతో ఆ మార్గంగుండా వెళుతూ, ఒక కొలను చూసి, అక్కడ ఆగాడు. పిన్నవయస్కులైన రాకుమారులు పుట్టనుంచి మెరుస్తూన్న కళ్ళకేసి, గులకరాళ్ళు విసిరారు. ఆగ్రహించిన ముని, పిల్లల తల్లిదండ్రులను శపించాడు. వెంటనే వాళ్ళు అనారోగ్యం పాలయ్యారు. రాజు వచ్చి మునికి నమస్కరించి, క్షమించమని వేడుకున్నాడు. ముని శాంతించి, శాపాన్ని ఉపసంహరించుకున్నాడు. కాని రాజు పక్కనే నిలబడి వున్న రాకుమార్తె సుకన్యను తన కిచ్చి వివాహం చేయాలన్నాడు. వృద్ధుడైన మునికి తన కుమార్తెనెలా ఇవ్వడమని రాజు శంకించాడు. కాని రాకుమారి సుకన్య అందుకు సమ్మతించి చ్యవనుడి భార్య అయింది.

కొన్నాళ్ళకు దేవ వైద్యులయిన అశ్వినీదేవతలు చ్యవనుడి ఆశ్రమానికి అతిథులుగా వచ్చారు. దంపతుల మధ్య వున్న వయోభేదాన్ని చూసి, వృద్ధుడయిన చ్యవనుడికి యౌవనం ప్రసాదిస్తామన్నారు. అయితే, అందుకు సుకన్య ఒక పరీక్షకు నిలవాలన్నారు. సుకన్య సరే అన్నది.

అశ్వినీదేవతలూ, చ్యవనుడూ సమీపంలో వున్న కొలనులో మునిగి లేచారు. చ్యవనమునికి యౌవనం సంప్రాప్తించింది. అయితే, చ్యవనమునితో సహా అశ్వినీదేవతలు కూడా చూడడానికి వయోరూపలావణ్యాలలో ఒకేవిధంగా ఉన్నారు!

సుకన్య ఆ ముగ్గురిలో తన భర్తను గుర్తించింది. పరీక్షలో నెగ్గినందుకు ఆమెను అశ్వినీదేవతలు దీవించి వెళ్ళిపోయారు.

చ్యవనముని రచించిన ప్రార్థనా శ్లోకాలు కొన్ని ఈనాటికీ పఠించబడుతున్నాయి.



# మీకు తెలుసా

1. అమెరికా అధ్యక్షుడి నివాసభవనానికి 'వైట్‌హౌస్' అనే పేరు ఎలా వచ్చింది?
2. టిప్పుసుల్తాన్ రాజధాని ఏది?
3. 'డాస్ కేపిటల్' (పెట్టుబడి) రచయిత ఎవరు?
4. 'సబర్మతి సాధువు' అని ఎవరిని పిలిచేవారు?
5. జీబ్రాల ప్రత్యేకమైన లక్షణం ఏమిటి?
6. హోల్కర్లు ఎక్కడినుంచి పరిపాలించారు?
7. రొడీసియా ఈనాటి పేరేమిటి?
8. రవీంద్రనాథ టాగూరుకు నోబెల్ బహుమతి తెచ్చిపెట్టిన గ్రంథం ఏది?
9. మొట్టమొదటి 'రొబోట్'ను ఎప్పుడు సృష్టించారు?
10. 'ఆర్యసమాజ' స్థాపకుడు ఎవరు?
11. అతిప్రాచీనమైన క్రీడ ఏది?
12. కోలార్ బంగారు గనులు ఏ రాష్ట్రంలో ఉన్నాయి?
13. చాక్లెట్లు తయారుచేసే సంస్థ తనకంటూ ఒక గ్రామాన్ని నిర్మించుకున్నది. అది ఎక్కడ ఉన్నది?
14. 'గీతగోవిందం' ఎవరు రచించారు?
15. డైనమైట్‌ను కనుగొన్న వారెవరు?
16. భారత జాతీయ కాంగ్రెస్ తొలి మహిళాఅధ్యక్షులు ఎవరు?

## సమాధానాలు

1. అగ్నిప్రమాదం కారణంగా జరిగిన నష్టం కనిపించకుండా వెల్ల వేయించడం వల్ల.
2. శ్రీరంగపట్నం.
3. కార్ల్‌మార్క్స్.
4. మహాత్మాగాంధీ.
5. ఏ రెండు జీబ్రాలకూ ఒకేవిధమైన చారలు ఉండవు.
6. ఇండోర్, ఈనాటి మధ్యప్రదేశ్.
7. జింబాబ్వే.
8. గీతాంజలి.
9. 1962లో, అమెరికాలో.
10. స్వామి దయానంద సరస్వతి.
11. పోలో, (క్రీ.శ. మొదటి శతాబ్దం).
12. కర్నాటక.
13. బోర్న్‌విల్లే (క్యాడ్‌బరీ సంస్థ).
14. జయదేవ్.
15. ఆల్‌ఫ్రెడ్ నోబెల్. స్వీడిష్ రసాయనిక శాస్త్రవేత్త. 1867లో.
16. డా॥ అనీబిసెంట్. 1917లో జరిగిన కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించారు.



# కీచుకీచు పిశాచాలు

ఒకనాటి సాయంకాలంవేళ పోలవరం నుంచి ఐనవరానికి, ఆరు ఎడ్ల బండ్లలో, ఒక పెళ్ళి వారి బృందం వెళుతున్నది. అక్కడి ఉమా రామలింగేశ్వరాలయంలో పెళ్ళి జరిపిస్తామని, ఆడపెళ్ళి వారికి మొక్కు వున్నదట. అన్ని బండ్లకూ వెనకగా వస్తున్న ఎడ్ల బండిలో, వంట వాళ్ళు సారె బుట్టలతో సర్దుకు కూర్చున్నారు.

బండ్లన్నీ ఐనవరానికి ఒకకోసుదూరంలో వుండగా, వంటవాళ్ళపెద్దకు సున్నిఉండల బుట్ట వెంటతేవడం లేదని తెలియవచ్చింది. అతను పక్కన వున్న రామబ్రహ్మం అనేవాడి భుజంతట్టి, "ఒరే, ఇక్కడున్న వాళ్ళలో నువ్వే పాతికేళ్ళ నవయువకుడివి. మిగతా వాళ్ళకు గాడిపొయ్యిల దగ్గర నిలబడి వంటలు చేసే ఓపిక తప్ప, అలా కాలుసాచి నాలుగడుగులు వేసే ఓపిక పోయింది. నువ్వు తిరిగి మన ఊరెళ్ళి, అటకమీదున్న సున్నిఉండల బుట్ట తీసుకుని, ఏదైనా బాడుగ బండిలో రేపు పొద్దున్నే బయలుదేరి రా. పెళ్ళి ముహూర్తం రేపు రాత్రికి కదా!" అంటూ రామబ్రహ్మానికి బాడుగకుగాను పాతిక రూపాయలిచ్చాడు.

రామబ్రహ్మం తిరుగు ప్రయాణమై, ఊరు చేరేసరికి చీకటి పడుతున్నది.వాడికి బండి బాడుగ మిగుల్చుకోవడానికి ఒక ఆలోచన వచ్చింది. తను ఇప్పుడే సున్నిఉండలబుట్ట తీసుకుని, సముద్రపుఒడ్డుగా అడ్డదారిన వెళ్ళిపోతే, తెల్లవారేసరికి ఐనవరం చేరుకోవచ్చు!

ఇలా అనుకుని రామబ్రహ్మం సున్నిఉండలబుట్ట నెత్తిన పెట్టుకుని, సముద్రపుఒడ్డున ఇసుక దిబ్బల మీదుగా నడక ఆరంభించాడు. ఆరోజు పున్నమి కావడంతో పుచ్చపువ్వులా వెన్నెల కాస్తున్నది. ఇసుకదిబ్బలకు ఈవైపు నురుగులు కక్కే సముద్రం; ఆవైపు గాలి తాకిడికి సంగీతం పాడుతున్నట్లున్న సరుగుడు తోటలు!

మాచిరాజు కామేశ్వరరావు

రామబ్రహ్మం ఇలాంటి వాతావరణంలో ఏనాడూ ఒంటరిగా ప్రయాణం చెయ్యలేదు. వాడు బిక్కుబిక్కుమంటూ ఇటు సముద్రం కేసీ, అటు సరుగుడు చెట్లకేసీ తల తిప్పి చూస్తూ, కొంతదూరం నడిచి ఆయాసంతో ఒకచోట బుట్ట పక్కన పెట్టుకు కూర్చున్నాడు.

ఆ మరుక్షణం, పెద్ద దివిటీల వెలుగుతో పాతకాలం నాటి ఒక తెరచాపల ఓడ, వాడున్న చోటుకు వచ్చి ఆగింది. ఓడలోంచి విదేశీ దుస్తుల్లో వున్న పది పిశాచాలు, కీచు కీచు, పీసు పీసుమనే ఏదో భాషలో మాట్లాడు కుంటూ ఒడ్డుకు దిగినై. వాటి వెనక నల్లగా తుమ్మమొద్దులా వున్న పిశాచం ఒకటి, చేతిలో వున్న బాణాకర్రను గిరగిరా తిప్పుతూ ఒడ్డుకు దూకింది.

ఇది చూస్తూనే రామబ్రహ్మానికి భయంతో ఒళ్ళంతా జలదరించింది. "పాతిక రూపా యలు మిగుల్చుకునేందుకు ప్రాణాన్ని ఫణంగా పెట్టాను. కొత్తగా కాపరానికి వచ్చిన కావేరికి అన్యాయం జరిగిపోయింది! అయినా, మానవ ప్రయత్నం, దేవుడి సాయం!" అను కుంటూ వాడు, సున్నిఉండలబుట్ట, నెత్తి నెత్తుకుని పారిపోబోయాడు.

అయితే, ఇంతలో స్వదేశీ నల్లపిశాచం పరుగున వచ్చి, బాణాకర్రతో వాడి దారిని అడ్డగించి, "ఒరే, బాబూ! పారిపోకు. పరాయి దేశ పిశాచాల ముందు మనకు అవమానం. అవి పరాసూ, బుడతకీచుపిశాచాలు. నేను స్వదేశీ పిశాచాన్ని. బతికుండగా విదేశాలకు వెళ్ళాలనే కోరిక తీరక, చచ్చి ఈ పిశాచాలుండే





దేశంలో స్థిరపడ్డాను. నేను ఒక దుబాషిని!" అన్నది.

ఇంతలో విదేశీ పిశాచాలు అక్కడికి వచ్చి, ఏదో కీచుకీచు మంటూ స్వదేశీ పిశాచాన్ని ప్రశ్నించాయి. స్వదేశీ పిశాచం వాటి కీచు కీచు భాషలో ఏదో జవాబిచ్చింది.

అప్పటికి కాస్త స్థిమితపడిన రామబ్రహ్మం, స్వదేశీ పిశాచాన్ని, "ఈ కీచు కీచు పిశాచాలు అంటున్నదేమిటి?" అని అడిగాడు.

"అవి నిన్ను మనిషివా, పిశాచివా అని అడుగుతున్నవి. బ్రతికున్న మనిషివని చెప్పాను," అన్నది స్వదేశీ పిశాచం. ఇంతలో మిగిలిన పిశాచాలు ముక్కుపుటాలు ఎగరేస్తూ, స్వదేశీ పిశాచాన్ని ఏదో ప్రశ్నించాయి.

స్వదేశీ పిశాచం, రామబ్రహ్మంతో, "వాటికేదో కమ్మటి వాసన వేస్తున్నదట! ఇంతకూ ఈ బుట్టలో ఏమున్నది?" అంటూ సున్నిఉండలబుట్ట మూత తెరిచింది.

పిశాచాలన్నీ చుట్టూ మూగాయి. స్వదేశీ పిశాచం చొరవగా బుట్టలోంచి సున్నిఉండలు తీసి వాటికి ఇస్తూ, "ఇవి మా దేశపు పెళ్ళి పిండివంటలు. రుచి చూడండి!" అన్నది.

విదేశీ పిశాచాలకు సున్ని ఉండల రుచి అద్భుతంగా వున్నది. వాటిలో బాగా ఒడ్డూ పొడుగూ వున్న పిశాచం, మిగిలిన పిశాచాలను కసురుతూ, బుట్టలో మిగిలివున్న సున్నిఉండలను మూట కట్టుకుని, కీచు కీచుమంటూ స్వదేశీ పిశాచానికి ఏదో చెప్పింది.

స్వదేశీ పిశాచం, రామబ్రహ్మంతో, "నాయకుడు పిశాచానికి సున్నిఉండల రుచి పరమాద్భుతంగా ఉన్నదట! బ్రతికున్నట్టయితే, ఈ దేశానికి వచ్చి ఇవి తినే అదృష్టం కలిగేది కాదంటున్నది," అన్నాడు.

"మహా గొప్పగా అన్నది! ఈ పరాయి దేశ పిశాచం అదృష్టం, నా దురదృష్టం కాబోతున్నది. రేపు పెళ్ళివారి సారెలోకి సున్నిఉండలు అందించకపోతే, మా వంటవాళ్ళపెద్ద అట్లకాడ ఎర్రగా కాల్చి,నాఒళ్ళంతా వాతలు పెట్టేస్తాడు!" అంటూ రామబ్రహ్మం తల బాదుకోసాగాడు.

స్వదేశీ పిశాచం నుంచి సంగతి తెలుసుకున్న నాయకుడి పిశాచం, ఖాళీబుట్టను

తీసుకుని ఓడకేసి ఎగిరిపోయి,క్షణాల మీద తిరిగి వచ్చి బుట్టను రామబ్రహ్మం ముందు పెట్టింది.

బుట్టమూత తీసి చూసిన రామబ్రహ్మానికి కళ్ళు చెదిరిపోయాయి. బుట్టనిండుగా పచ్చగా మెరిసిపోతున్న మేలిమి బంగారు నాణేలు!

రామబ్రహ్మం వాటికేసి కన్నార్పకుండా చూస్తూ,స్వదేశీపిశాచంతో,"ఈవిదేశీ బంగారం, మా దేశంలో మారుతుందా?" అన్నాడు.

దానికి స్వదేశీ పిశాచం పొట్ట చెక్కలయ్యేలా నవ్వి, "ఒరే అమాయకుడా! బంగారానికి స్వదేశం - విదేశం అంటూ హద్దులు లేవు. అవసరపడితే స్వర్గ నరకాల్లో కూడా సునాయాసంగా మార్చుకోవచ్చు," అంటూ వాడి వీపు మీద గట్టిగా చరిచింది.

సంగతేమిటో సరిగ్గా అర్థం కాకపోయినా విదేశీ పిశాచాలు గట్టిగా చప్పట్లు చరిచి, స్వదేశీ పిశాచంతో కీచుకీచు మన్నవి.

స్వదేశీ పిశాచం, రామబ్రహ్మంతో, "ఒరే, బాబూ! నీ పంట పండింది -- అంటే బంగారప్పంట అన్న మాట. ఈ దొరపిశాచాలు తిరిగి పున్నమి నాటికి ఇక్కడికి వస్తాయట. ఈసారి మరిన్ని ఉండలతో పాటు కోవా, కజ్జికాయలు, జీడిపప్పుపాకం తీసుకురా," అని చెప్పింది.

ఆ తర్వాత కొంతసేపటికి పిశాచాలన్నీ కోలాహలంగా ఓడ ఎక్కి వచ్చినదారినే వెళ్ళిపోయాయి.

క్షణం ఆలస్యం చేయకుండా ఇంటిదారి పట్టాడు రామబ్రహ్మం. వాడు ఇల్లు చేరేసరికి





సంగతులన్నీ నువ్వు రహస్యంగా వుంచు," అంటూ హెచ్చరించాడు.

అయితేవాడు దాచాలనుకున్న రహస్యం, ఆసరికే పక్క వాటాలో వున్న కనకం తెలుసుకున్నది. ఈ కనకం ఊరి తూర్పు వీధిలో భర్త సింగన్నతో కలిసి మిఠాయి దుకాణం నడుపుతున్నది. రామబ్రహ్మం చీకటి పడుతూనే బయలుదేరడం, తిరిగి అర్ధరాత్రికి రావడం,ఇంట్లోదీపంవెలిగించడం—ఇదంతా ఏమిటా అన్న కుతూహలంతో, ఆమె కిటికీ సందులోంచి చూసి అంతా తెలుసుకున్నది.

కనకం భర్త పేరుకు సింగన్న అయినా, భార్య దగ్గర పిల్లిని చూసిన ఎలుకలా భయపడిపోతూంటాడు. కనకం అతడికి నాలుగు మాటల్లో సంగతి చెప్పి, "ఈ రాబోయే పున్నమికి కీచుకీచు పిశాచాల దగ్గరకు బండెడు పిండివంటలు పట్టుకుపోయి, బండి నిండా బంగారు కాసులు తెచ్చుకుందాం," అన్నది.

"అదేమంత కష్టం? అలానే చేద్దాం!" అన్నాడు సింగన్న తలూపుతూ.

కనకం కస్సుమంటూ, "ఉట్టినే బుర్రూపకు! ఆ సమయంలో రామబ్రహ్మం సముద్ర తీరానికి రాకూడదు. అందుకు మనం ఇలా చేయాలి," అంటూ భర్త చెవిలో ఏదో రహస్యంగా చెప్పింది.

భార్య చెప్పిన ప్రకారం సింగన్న పౌర్ణమి మూడురోజులుందనగా పట్నం వెళ్ళి, మరొక్క రోజుందనగా తిరిగివచ్చి, రామబ్రహ్మం

నడిరాత్రి అయింది. నెత్తిన బుట్టతో తిరిగి వచ్చిన భర్తను చూసి, ఏదో అనబోయిన భార్యను, ముందు తలుపు వేసి రమ్మని చెప్పి, రామబ్రహ్మం నట్టింట ఒక పంచె పరిచి, దానిమీద బుట్టెడు బంగారు కాసులు గుమ్మరించాడు.

ఇదిచూసి నోట మాటరాక గుడ్లప్పగించి చూస్తున్న భార్యతో, రామబ్రహ్మం జరిగిందంతా చెప్పి, "మనకు గ్రహాలు అనుకూలంగా వున్నట్టుంది. అందుకే మనను దేశ విదేశీ పిశాచాలు అనుగ్రహించినై. వచ్చే పౌర్ణమికి కొత్తకొత్త మిఠాయిలు వండి ఎలాగూ సముద్ర తీరానికి వెళ్ళాలిగదా! ఆ తర్వాత ఊళ్ళో పెద్ద మిఠాయి అంగడి ప్రారంభిద్దాం. ఈ

భార్యతో, "మీ అమ్మకు బాగా జబ్బు చేసింది. పరిస్థితి కిందా మీదుగా వుంది. ఈ సంగతి నీకు చెప్పేందుకు పనివాణ్ణి అప్పుడే పంపారే! వాడింకా కబురందించలేదా?" అన్నాడు.

ఈ వార్త వింటూనే రామబ్రహ్మం, భార్య పుట్టెడు దిగులుతో పట్నం బయలుదేరి పోయారు. కనకం తన పథకం పారినందుకు సంతోషించి, ఒక బండి నిండుగా మిఠాయిలు నింపుకుని, సింగన్న తోడు రాగా పున్నమిరాత్రి కీచుకీచు పిశాచాలు వచ్చే సముద్ర తీరానికి వెళ్ళింది.

బాగా పొద్దుపోయాక పిశాచాలఓడ దివిటీల వెలుగుతో తీరం చేరింది. స్వదేశీ పిశాచం బాణాకర్ర ఆసరాతో వంగి వంగి నడుస్తూ, కనకం వాళ్ళ దగ్గరకు వచ్చి, "ఆ కుర్ర కుంక ఏడీ?" అన్నది.

కనకం తడుముకోకుండా, "ఆ కుంకగాడికి కళ్ళు నెత్తికొచ్చాయి. కీచుకీచు పిశాచాల మీది భక్తి గౌరవాలతో మేం బండెడు మిఠాయిలు తెచ్చాం!" అన్నది.

దానికి స్వదేశీపిశాచం చిన్నగా మూలిగి, "ఇంకెక్కడి మిఠాయిలు! ఇంకెక్కడి కీచు కీచు పిశాచాలు! వాడు తెచ్చిన సున్నివుండలు తిని, ఏనాడూ అలాంటివి తినే అలవాటు లేకపోవడంతో, పిశాచాలన్నీ జబ్బుపడి పోయినై. వాళ్ళ నాయకుడు నన్ను తన్ని తరిమేశాడు. నాకిక ఈ స్వదేశమే గతి!" అంటూ కుంటుతూ ఎగిరి, దూరంగా వున్న సరుగుడు తోటలోకి వెళ్ళిపోయింది.

ఇదిచూసి సింగన్న, "కనకం, మన దురాశే మనని చెరిపింది! ఉన్న డబ్బుచాలక అప్పు కూడా చేసి, బండెడు మిఠాయిలు తయారు చేశాం," అన్నాడు రెండు చేతులతో తల పట్టుకుంటూ.

జరిగినదానికి ఒక్కక్షణం నివ్వెరపోయి, "ఇక వదులు! ఇప్పట్లో మనం ఊరు ముఖం చూడలేం. మా పుట్టింటికి పోయి కొన్నాళ్ళు వుందాం," అంటూ మిఠాయిలున్న బండికేసి బయలుదేరింది.

సింగన్న తలవంచుకుని భార్య వెనక నడిచాడు.






# ఆదర్శదంపతులు

పూర్వం ప్రయాగలో ఒక వర్తకుడుండేవాడు. ఆయన సంపన్నుడేగాక సజ్జనుడు కూడా. ఆయన భార్య అన్ని విధాలా భర్తవంటిదే. ఆ భార్యాభర్తలు ఆదర్శదంపతులలాగా ఉండే వారు.వారి జీవితాలకు ఒకటే కళంకం; అదే మిటంటే, వారి కుమారుడు శశికేతుడనేవాడు.

శశికేతుడు పరమ పాపిష్టి. వాడు పసితనం నుంచీ చెడు సావాసాలు చేసి దుర్మార్గంలో పడిపోయాడు. తండ్రి ఎంత మందలించినా, తల్లి ఎంత బతిమాలినా వాడి పద్ధతి కొంచెం కూడా మారలేదు. వాడి మూలాన వాడి తలి దండ్రులునలుగురిలోనూ తల ఎత్తుకు తిరగ టానికి కూడా వీలులేకుండా పోయింది.

వర్తకుడికి ఊరి పూజారి ఆప్తమిత్రుడు. అందుచేత వర్తకుడు తన కొడుకు విషయం పూజారితో చెప్పుకున్నాడు.

"మా శశి దుర్మార్గం ఆనాటికానాడుహెచ్చి పోతున్నదిగానికొంచెం కూడా తగ్గేటట్టు లేదు. ఏళ్లు పైన పడితే వాడే సరి అయిన మార్గం లోకి వస్తాడని ఆశపడ్డానుగాని, ఆ ఆశకాస్తా పోయింది. ఏంచేస్తే వాడు బాగుపడతాడో మీరైనా చెప్పండి.నా భార్య సగం వాడిమూలానే మనోవ్యాధితోతీసుకుంటున్నది.వాడుబాగుపడక పోతే అది జీవించదు!" అన్నాడు వర్తకుడు.

"నిజం చెప్పాలంటే, మీ ఇద్దరి మంచి తనమే వాణ్ణి ఇంతకు తెచ్చింది. మీ అండ చూసుకునేవాడు అచ్చుపోసిన ఆబోతులాగా తిరుగుతున్నాడు. నా మాట విని వాణ్ణి దూర దేశం పంపెయ్యండి. అక్కడ వాడికి పరపతి ఉండదు, దుర్వ్యయం చెయ్యటానికి డబ్బుం డదు. తప్పనిసరిగా వాడు తన బతుకుతెరువు తానే చూసుకోవలిసి వస్తుంది. బాధ్యత పైన పడుతుంది. ఆ తరవాత వాడే మారిపోతాడు, ప్రయోజకుడౌతాడుకూడా!" అన్నాడు పూజారి.

ఈ సలహా వర్తకుడికి సరిగానే తోచింది. ఆయన తన కుమారుణ్ణి పిలిచి, "నాయనా

నువ్వుదూరదేశం వెళ్లి ప్రయోజకుడివై కీర్తితెస్తే నేను చాలాసంతోషిస్తాను.నీకు ఏదేశం వెళ్ళాలని ఉన్నది?" అని అడిగాడు.

"నన్ను కాశీకి పంపించండి!" అన్నాడు శశికేతుడు. ఆ పుణ్యక్షేత్రంలో మహాపాపులు విచ్చలవిడిగా సంచరిస్తూ ఉంటారని వాడు తన స్నేహితులు చెప్పగా విని వున్నాడు. కాశీ నగరంలో పూజారికి దూరపుబంధు వొకాయన ఉన్నాడు. ఆయన పేర ఒక ఉత్తరం రాసి పూజారి వర్తకుడి కొడుకుకిచ్చాడు. దాన్ని తీసుకుని శశికేతుడు కాశీకి బయలుదేరాడు.

పూజారి చేసిన ఆలోచన ఫలించినట్టే కనబడింది. ఎందుకంటే, కాశీలో ఉండే ఆయన బంధువు శశినిగురించి అప్పుడప్పుడూ మంచిగానే ఉత్తరాలు రాస్తూ వచ్చాడు. ఈ ఉత్తరాలను పూజారి పట్టుకుపోయి వర్తకుడికి చదివి వినిపించేవాడు. వర్తకుడూ, ఆయన భార్యా కూడా తమ కొడుకు ప్రయోజకుడవుతున్నాడని ఎంతో ముచ్చట పడ్డారు.

ఇంతలో పిడుగుపడ్డట్టయింది. కాశీ నుంచి శశికేతుణ్ణి గురించి పూజారికి ఒక ఉత్తరం వచ్చింది. శశికేతుడికీ మరికొందరు తాగుబోతు జూదరులకూ ఏదో తగాదా వచ్చింది. దాని ఫలితంగా మిగిలిన వాళ్లు శశికేతుణ్ణి పొడిచి చంపారు.

దూరదేశం వెళ్లినా శశికేతుడు మారలేదన్నది పూజారికి స్పష్టమయింది. ఈ దుర్వార్తను తన స్నేహితుడైన వర్తకుడి చెవిని వెయ్యటం



ఎట్లాగో పూజారికి అర్థం కాలేదు. కానీ నిజం దాచి లాభం లేదు. వర్తకుడి భార్య అసలే రోగిష్టి మనిషి. ఒంటరిగా పిలిచి వర్తకుడితోనే ఈ మాట చెప్పటానికి నిర్ణయించాడు పూజారి. తన కొడుకు దుర్మరణం గురించి విని వర్తకుడు దిమ్మరపోయాడు. కాని ఆయన కన్నీరు కార్చి ఏడవలేదు. "ఇటువంటిదేదో జరుగుతుందని నేను చాలాకాలంగా అనుకుంటూనే ఉన్నాను. భయపడ్డంతా జరిగింది. దూరదేశం పంపితే వాడు మారతాడనుకున్నాం, కాని వాడు మారలేదు. మారే రకం కూడా కాదు!" అన్నాడాయన విచారంగా.

తరవాత ఆయన పూజారికేసి తిరిగి, "బాబూ! మీరీ సంగతి నా భార్యకుమటుకు




ఉన్నానని మీతో మరీ మరీ చెప్పమన్నాడట. అన్నట్టు మీవాడికి త్వరలోనే రాజుగారిదగ్గర కొలువవుతుందని మా బంధువు గట్టిగా అంటున్నాడు!" అనేవాడు.

ఇంకోసారి, "వచ్చే వైశాఖ పాడ్యమి నుంచీ మీవాడు కొలువులో ప్రవేశిస్తున్నాడట!" అనే వాడు.

మరొకసారి, "మీవాడికి రాజుగారు గొప్ప బహుమతి ఇచ్చారట. వాడి పెళ్లి విషయం తానే చూస్తాననికూడా అంటున్నాడట!" అనే వాడు.

వేరొకసారి, "మీవాడికి మీ ఇద్దరినీ చూడా లని ఎంతగానో ఉందట! శలవు దొరకటమే వ్యవధిగా తిరిగి వచ్చేస్తానంటున్నాడు!" అనే వాడు.

తెలియనివ్వకండి. అసలే దాని ఆరోగ్యం ఏమీ బాగాలేదు. ఈ మాట వింటే గుండె పగిలి చచ్చిపోతుంది. అది ఇంక ఎంతో కాలం బతకదు. తన కొడుకు దూరదేశంలో ఉన్నా సుఖంగా ఉన్నాడనుకుంటూ చావని వ్వండి. మీరు ఎప్పటిలాగే మీ బంధువు రాసినట్టుగా ఉత్తరాలు తెచ్చి దానికీ నాకూ వినిపిస్తూ ఉండండి!" అన్నాడు.

"అలాగే చేస్తాను! మీరేమీ విచారించకండి. ఆ ఇల్లాలికి బాధ ఏమాత్రమూ కలగకుండా నేను చూస్తాను!" అన్నాడు పూజారి. ఆయన నెల కొకసారి ఒక ఉత్తరం సృష్టించి వర్తకుడి ఇంటికి వెళ్ళేవాడు. "ఏమండోయ్, కాశీనుంచి ఇంకో ఉత్తరం వచ్చింది. మీ వాడు సుఖంగా

పూజారి వచ్చినప్పుడల్లా వర్తకుడూ, ఆయన భార్యా ఎంతో ఆనందంతో స్వాగతం చెప్పే వారు. ఆయన చెప్పే విషయాలను అతిశ్రద్ధగా వినేవారు. వర్తకుడి భార్య బాధతో మంచంపట్టి ఉన్నాకూడా, పూజారిని చూడగానే తన మొహంలో బాధ ఏ మాత్రమూ తెలియనివ్వక ఎంతో ఆనందం కనబరిచేది.

"ఇంత మంచి ఇల్లాలిని మోసం చేస్తు న్నాను గదా!" అని పూజారి లోలోపల చాలా నొచ్చుకునేవాడు. కాని తాను తెచ్చిన అబద్ధపు వార్తలు విని ఆవిడ పొందే ఆనందం చూడ గానే ఆయనకు, "నేను చేసేది మంచిపనే! ఆ ఇల్లాలు ఆనందంపొందటం కన్న కావలి

సిందేమిటి?" అనిపించేది. ఈవిధంగా నాలు గేళ్లు గడిచాయి. వర్తకుడి భార్య జబ్బు క్రమంగా ముదురుతూ వచ్చింది. ఆవిడ క్షయతో పూర్తిగా మంచంపట్టిపోయింది.

ఆమె ఇక ఎంతోకాలం బతకదని వైద్యులు చెప్పేశారు. ఒకనాడు పూజారికి వార్త వచ్చింది. వర్తకుడి భార్య ఇప్పుడో,ఇంకాస్సేపటికో అన్న ట్టున్నదని చెప్పారు. పూజారి వెంటనే బయలు దేరి వెళ్లాడు. వర్తకుడు ఇంట్లో లేడు.

"నేను పోతున్నాను, బాబూ! ఆ ముసలా యన భారం నీదే!" అన్నది వర్తకుడి భార్య పూజారిని చూడగానే.

"అదేమిటమ్మా? అలా అధైర్యపడతారూ? మీవాడు బయలుదేరి వస్తున్నాడట! ఇప్పుడే నాకు వార్త వచ్చింది. ఈపూట కాశీనుంచి కొందరు యాత్రికులు వచ్చారు. వారిద్వారా మా బంధువు కబురుచేశాడు. మీరు త్వరలోనే మీశశిని కలుసుకుంటారు!" అన్నాడు పూజారి.

రోగి విచారంగా నవ్వి, "ఆమాట నిజమే, నాయనా! ఆ లోకంలో ఇద్దరమూ కలుసు కుంటాం!... ఆశ్చర్యపడకు, బాబూ! నాకు చాలాకాలంగా తెలుసు, మా శశి చనిపో యాడు. కాని కాశీలో ఉన్న మీ బంధువు ఎంత ఉత్తముడు! ఆయన ఋణం తీర్చు కోలేం! శశి పోయిన సంగతి తెలిస్తే ముస లాయన ఏనాడో కుంగిపోయి ఉండును! ఇన్నాళ్లూ ఈ సంగతి ఆయనకు తెలియ కుండా నేను చూసుకున్నాను! ఇక మీదట ఆయనకు తెలియకుండా చూస్తానని నువ్వు ప్రమాణం చెయ్యి, నాయనా! లేకపోతే నేను శాంతంగా చచ్చిపోలేను. మావాడు పోయి నట్టు ఆయనకు బతికుండగా తెలియకూడదు! ఇదే నాకోరిక!" అంటూ వర్తకుడి భార్య కన్ను మూసింది.

పూజారికి విచారం కలగలేదు, పట్టరాని ఆనందం కలిగింది.

ఎంత ఆదర్శదంపతులు! ఒకరికి బాధ కలగకుండా ఉండాలని ఒకరు కార్చిచ్చు లాంటి వార్తను తమ హృదయాలలో దాచుకు న్నారు.

ఆ వర్తకుణ్ణీ, ఆయన భార్యనూ మెచ్చు కుంటూ పూజారి తన ఇంటిదారి పట్టాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.


Bhanu



Tajy Prasad

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * అక్టోబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **ఉత్సవ నర్తన!** రెండవ ఫోటో : **రక్షణ శిక్షణ!**

పంపినవారు : కె.వి. రాఘవరావు, 55-10-19, ఎం.ఎం టి.సి. కాలనీ,
హెచ్.బి. కాలనీ పోస్టు, విశాఖపట్నం - 530 022 (ఆం. ప్ర)
బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 60.00
చందా పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

THE MOST ENDEARING GIFT YOU CAN THINK OF
FOR YOUR NEAR AND DEAR WHO IS FAR AWAY

# CHANDAMAMA



**Give him the magazine in the language of his choice—**
Assamese, Bengali, English, Gujarati, Hindi, Kannada, Malayalam, Marathi, Oriya, Sanskrit, Tamil or Telugu
**—and let him enjoy the warmth of home away from home.**

**Subscription Rates (Yearly)**

**AUSTRALIA, JAPAN, MALAYSIA & SRI LANKA**

By Sea mail Rs.**117.00** By Air mail Rs. **264.00**

**FRANCE, SINGAPORE, U.K., U.S.A., WEST GERMANY & OTHER COUNTRIES**

By Sea mail Rs. **123.00** By Air mail Rs. **264.00**

**Send your remittance by Demand Draft or Money Order favouring 'Chandamama Publications' to:**

CIRCULATION MANAGER **CHANDAMAMA PUBLICATIONS** CHANDAMAMA BUILDINGS VADAPALANI MADRAS 600 026

